మనస్సున నాటుకునే
చిహ్నంగా చేయండి
EKCO
(REGD)
స్కెచ్ పెన్‌తో




స్వచ్ఛమైన
మరియు
స్థిరమైన
వ్రాతకు
ఆదర్శమైనది
స్కెచ్ పెన్. చిత్ర
కారులకి ఇది ఆనంద
దాయకమైనది.
విద్యార్థులకు దీనితో
వ్రాయుటసులభం.
అధికారులు దీనితో
సంతకం చేయటంగౌర
వంగా భావిస్తారు.
వివిధ రంగులలో,
ఆకర్షణీయమైన
పాకెట్లలో లభిస్తాయి.

డిస్ట్రిబ్యూటరు :
కిరన్ & కం.
73/75 స్యామ్‌సెల్ స్ట్రీట్,
బొంబాయి 400 002. ఫోను : 324432

ADVERTS-WP-211-TLG

# జెమ్స్‌తో బలే మజా

## అదృష్టవంతులు గెలుపొందేందుకు 1001 బహుమతులు

ఇక్కడ లేని అంకె ఏమిటో చెప్పుకోండి చూద్దాం ?







మీ జవాబు, మీ పేరు, మీ చిరునామా కూడా ఇంగ్లీషులోనే విడి అక్షరాలలో వ్రాయండి. మీ ఎంట్రీలను ఈ క్రింది చిరునామాకు పంపండి.

"Fun with Gems"
Dept. C–14
Post Box No. 56,
Thane 400 601
Maharashtra.

ఎంట్రీలు గ్రహింపబడేందుకు ఆఖరు తేదీ: 15.9.78

## త్వరపడండి!

మీ జవాబుతోపాటు క్యాడ్‌బరిస్ జెమ్స్‌యొక్క ఖాళీ ప్లాస్టిక్ ప్యాకెట్ పెద్దది (30 గ్రాములది) ఒకటి జతపరచి పంపండి. సరియైన జవాబు పంపిన మొదటి 1001 మంది విజేతలకు రూ. 11 విలువగల స్టేట్ బ్యాంక్ కానుక చెక్‌లు లభిస్తాయి.

**చాక్లెట్ మధ్యలోగలిగిన రంగురంగుల క్యాడ్‌బరిస్ జెమ్స్**

CHAITRA-C-193 TEL

# స్నేహితురాలికి మీనా చేసిన సహాయం.



















రోజుకు రెండుసార్లు న్యూట్రామూల్ తీసుకునే అలవాటువలన లాభిస్తుంది చివరికి. అందుకే దేశమందంతటా వేనకి వేలమంది బలాన్నిచ్చే న్యూట్రామూల్ వాడకం మొదలెట్టారు. న్యూట్రామూల్‌లో బలవర్ధకమైన, మీగడ గల అమూల్ పాలతోబాటు అసలైన కోకో, మాల్ట్, పంచదార ఉన్నాయి. అరే ఆశ్చర్యం! న్యూట్రామూల్ ఖరీదులో తక్కువ! న్యూట్రామూల్ 500 గ్రాముల డబ్బా ధర కేవలం రూ. 11. పన్నులు అదనం. మీనాకే గాదు ఇంకా మరెందరికో న్యూట్రామూల్ అంటే ఎంతో యిష్టం.






అమూల్ వారి
**న్యూట్రామూల్**
**కప్పు కప్పుతో మీకు బలం వచ్చు!**

daCunha/N/2p/Tel

చందమామ
సింహళ భాషలో
ప్రారంభించిన సందర్భంలో

భారత ప్రధాని

# సందేశం



చందమామ ప్రకాశకులు భారతీయ బాలలకు శుద్ధమూ, యోగ్యమూ అయిన వినోదం అందజేయుట ద్వారా బాలల హృదయాలలో సముచిత స్థానం సంపాదించుకున్నారు. ఇప్పుడు వారు శ్రీలంకకు విస్తరించ గోరటం నాకు ఆనందాన్ని కలిగిస్తున్నది.

వారి ఈ నూతన కృషిని అభినందించుతూ, వారికి భారతీయ బాలల నుంచి ఎలాటి ఆదరం లభించిందో అలాటి ఆదరమే సింహళ బాలల నుంచి కూడా లభిస్తుందని నమ్ముతున్నాను.

మొరార్జీ దేసాయి

న్యూఢిల్లీ,
జూన్ 3, 1978

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["గంధపుచెట్టు"] కు ఆధారం పి. వి. ఎస్సెస్సెస్రాజు రచన. పదవులలో ఉన్న వారు తమ విధులను నిర్వర్తించటానికి అనేకమంది ఇతరులమీద ఆధారపడవలసి ఉంటుంది. అయినప్పటికీ వారు ఎవరినీ గుడ్డిగా నమ్మరాదు. రాజు అయినా సరే, తన కిందివారిని గుడ్డిగా నమ్మినంత మేరకు, అతను తన బాధ్యతను సరిగా నిర్వర్తించ లేదనే అనుకోవాలి. ఈ కథలోని నీతి ఇదే.

పై సంచిక నుంచీ పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు ప్రకటించ నిశ్చయించాము. ప్రశ్నలు అందరికీ పనికివచ్చేవిగా పంపండి.

సంపుటి 63 ఆగస్టు '78 సంచిక 2

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00






అసత్యస్సర్వలోకేస్మిన్
సతతం సత్కృతాః ప్రియైః,
భర్తారం నానుమన్యంతే
వినిపాతగతం స్త్రియః. 1

[లోకంలో దుష్టస్త్రీలు, భర్త ఎల్లప్పుడూ తమ కోరికలు తీర్చుతూ, సంతోషం కలిగించి నప్పటికీ, వాడికి దుర్దశ కలిగినప్పుడు లక్ష్యంచెయ్యరు.]

ఏష స్వభావో నారీణాం
అనుభూయ పురా సుఖం,
అల్పా మప్యాపదం ప్రాప్య
దుష్యంతి ప్రజహ త్యపి. 2

[అలాటి స్త్రీలస్వభావం ఎలా ఉంటుందంటే, ముందు ఎంతోసుఖం అనుభవించి కూడా, భర్తకు కష్టదశ రాగానే నిరసించి, విడిచిపెట్ట జూస్తారుకూడా.]

అసత్యశీలా, వికృతా
దుర్గ్రాహ్యహృదయా స్సదా
యువత్యః పాపసంకల్పాః
క్షణమాత్రా ద్విరాగిణః. 3

[అసత్యాలాడుతూ, వికారస్వభావం కలిగి, అంతు చిక్కని మనస్సుకలిగి, పాపబుద్ధితో, క్షణంలో విరిగిన మనస్సుగల వారవుతారు.]

దుష్ట స్త్రీలు



# నిజమైన అబద్ధం

శర్యాతి వంశాన పుట్టిన వత్సరాజు వీత హవ్యుడికి నూరుగురు కొడుకులు. అతను తన కొడుకులతో భూమినంతా జయించటానికి బయలుదేరాడు.



వారు కాశీరాజ్యం పై దాడిచేసి, కాశీ రాజైన హర్యశ్వుణ్ణీ, అతని కొడుకు సుదేవుణ్ణీ చంపారు. సుదేవుడి కొడుకు దివోదాసు పారిపోయాడు.



దివోదాసు మరొక రాజధాని నిర్మించు కుంటే, వీతహవ్యుడి కొడుకులు దాన్ని నాశనం చేసి, దివోదాసును తరిమారు.



చివరకు దివోదాసు భార్యా సహితుడై భరద్వాజర్షి ఆశ్రమంలో తలదాచుకు న్నాడు. తనవారందరూ పోయినందుకూ తనకు వంశాంకురం లేనందుకూ దివో దాసు విచారించాడు.

దివోదాసు వంశాన్ని నిలబెట్టటానికి గాను పుత్రుడు కలగ గలందులకు యజ్ఞం చెయ్యమని భరద్వాజుడు దివోదాసుకు చెప్పాడు.





యజ్ఞం చేసిన ఫలితంగా దివోదాసుకు ఒక కుమారుడు కలిగాడు. అతనికి ప్రతర్దను డని పేరు పెట్టారు. అతను పరాక్రమవంతుడుగా పెరిగాడు.






ప్రతర్దనుడు క్షత్రియోచిత విద్యలన్నిటా చక్కగా ఆరితేరాడు.



ఒకనాడు దివోదాసు ప్రతర్దనుడికి తనకు జరిగిన పరాభవమంతా చెప్పి, "నాయనా, నాకుగాను నువ్వు పగతీర్చుకోవాలి," అన్నాడు.




ప్రతర్దనుడు కాలక్రమాన సేనలను పోగుచేసి, వీతహవ్యుడు అనుకోని సమయంలో అతని రాజ్యంమీద పడ్డాడు. వీతహవ్యుడి నూరుగురు కొడుకులూ యుద్ధంలో చచ్చారు, వీతహవ్యుడు పారిపోయాడు.





అలా పారిపోయిన వీతహవ్యుడు భృగుమహర్షి ఆశ్రమంలో తల దాచుకున్నాడు. భృగువు అతనికి తత్వోపదేశంచేసి, తపస్సు చేసుకోమన్నాడు.

వీతహవ్యుణ్ణి చంపాలన్న దృఢ సంకల్పంతో ప్రతర్దనుడు భృగుడి ఆశ్రమానికి వచ్చి, "నిజమైన క్షత్రియుడైతే నాతో యుద్ధంచెయ్యమనండి!" అని భృగువుతో అన్నాడు. "ఇక్కడ అంతా బ్రాహ్మణులే! క్షత్రియుడెవడూ లేడు," అన్నాడు భృగువు.





భృగువు అబద్ధమాడటాడని ప్రతర్దనుడు నమ్మలేకపోయాడు. కాని వీతహవ్యుణ్ణి చూడగానే ఆ మనిషి పూర్తిగా మారిపోయినట్టు స్పష్టమయింది. క్షత్రియుడు బ్రాహ్మణుడుగా మారాడు!



# భల్లూక మాంత్రికుడు

## 2

[ కాళీవర్మ అనే క్షత్రియయువకుడు, ఉద్యోగం కోసం రాజధానీ నగరానికి పోతూండగా, దారిలో అతడికి బందిపోటు దొంగలను గురించి గ్రామస్థులు చెప్పారు. కాళీవర్మ గ్రామ యువకుల సాయంతో బందిపోట్లను వేటాడాడు. తరవాత అతడు నగరాన్ని సమీపిస్తుండగా, జితకేతురాజుగారి ఆశ్వికభటులు, అతణ్ణి హఠాత్తుగా చుట్టుముట్టి పట్టుకున్నారు. తరవాత—]

చంద్రశిలా నగర అశ్వసైనికులు, కాళీవర్మతో నగరం ప్రవేశించారు. అంత మంది సైనికులు, ఒక్కగానొక్కణ్ణి గుర్రం మీద బంధించి తీసుకుపోతూండటం చూసి, రాజవీధి వెంట నడిచే ప్రజలు చాలా ఆశ్చర్యం చెందారు. వాళ్ళల్లో కొందరు, ఆ గుర్రం మీద కట్టబడి వున్న బంధితుడెవడని అడిగినప్పుడు ఆశ్వికుల నాయకుడు ఎంతో విజయగర్వంతో, "ఈ బంధితుడా? ఇతడి పేరు కాళీవర్మ! మన రాజ్యానికేగాక, పొరుగునవున్న దుర్ముఖరాజుగారి ఉదయగిరి రాజ్యానికూడా ప్రబల శత్రువు. అరణ్యంలో యితణ్ణి పట్టుకునేందుకు మేం పడ్డ శ్రమ అంతా యింతా కాదు," అని చెప్పసాగాడు.

చంద్రశిలా, ఉదయగిరి రాజ్యాలు రెంటికీ విరోధి అయిన యీ కాళీవర్మ



కథ ఏమిటో విందామని కొంతమంది జనం అశ్వికుల వెనకగా రాజప్రాసాదం కేసి నడిచారు. అశ్వికుల నాయకుడు రాజప్రాసాదం ముందున్న ఆవరణలో తన తోటి అశ్వికులను వుండమని చెప్పి, రాజభవనంలోకి పోయి, ఒక భటుడి ద్వారా జితకేతు రాజుకు, తాను కాళీవర్మను బంధించి తెచ్చినట్టు కబురు చేశాడు.

ఆ సమయంలో రాజు జితకేతుడు, ప్రధానమంత్రితో పొరుగు రాజు దండెత్తి వస్తానంటూ దూత ద్వారా పంపిన లేఖ గురించ మంతనాలాడుతున్నాడు. కాళీవర్మ దొరికినట్టు వింటూనే ఆయన పరమానంద పడిపోతూ, మంత్రితో, "మహామంత్రీ! ఈ కాళీవర్మ అనే క్షత్రియ యువకుడి కారణంగా మనం, రాజు దుర్ముఖుడితో యుద్ధం చేయవలసిన ప్రమాదం ముంచుకొచ్చిందనుకున్నాను. వాడు దొరికాడు; ప్రమాదం తొలగిపోయింది. వాణ్ణి ప్రాణాలతో దుర్ముఖుడి వద్దకు పంపుదామంటారా, లేక ఉరి తీయించి, శవాన్ని పంపటం బావుంటుందంటారా?" అన్నాడు.

"మహారాజా, రాజు దుర్ముఖుడి లేఖలో వున్నదాన్నిబట్టి, ఆయనకు మీరు చెప్పిన రెండు పద్ధతుల్లో ఏదైనా సమ్మతమే. కాని, మనకు యీ దొరికినవాడు, బందిపోట్లను మన రాజ్య సరిహద్దుల నుంచి ఉదయగిరి రాజ్యంలోకి పారదోలిన కాళీవర్మే అన్న గట్టి రుజువు కావాలి గదా? అలా లేనప్పుడు మనం మాట తప్పిన వాళ్లమై, రాజు దుర్ముఖుడి వల్ల కొత్త చిక్కులు కొని తెచ్చుకున్న వాళ్ళమవుతాం," అన్నాడు మంత్రి.

"మన అశ్వికుల నాయకుడు, దొరికిన వాడు కాళీవర్మే అని కబురు చేశాడు గదా?" అన్నాడు రాజు జితకేతుడు.

"ఇంత పెద్ద చంద్రశిలానగర రాజ్యంలో, ఎంతమందయినా కాళీవర్మ పేరుగల వాళ్లుండవచ్చు. కనక, తమరు

స్వయంగా వెళ్ళి, అతణ్ణి విచారించి, శిక్షించటం మంచిది,'' అన్నాడు మంత్రి.

రాజు అందుకు సరేనంటూ బయలుదేరాడు. రాజూ, మంత్రీ భవనం ముందున్న ఆవరణను చేరేసరికి, అక్కడ చాలామంది ప్రజలు చేరి వున్నారు. మంత్రి ఆజ్ఞాపించగానే ఆశ్వికభటులు, కాళీవర్మ చేతులకు బిగించిన తాళ్ళు విప్పి, అతణ్ణి గుర్రం మీది నుంచి దిగమన్నారు.

కాళీవర్మ గుర్రం దిగి, నిర్భయంగా రాజూ, మంత్రుల కేసి తేరిపారజూస్తూ, ''మహారాజా, తమ సైనికులు అరణ్యంలో నా మీద హఠాత్తుగా వచ్చి పడి బంధించి, నన్ను చాలా అవమానపరిచారు. ఇందుకు వాళ్ళను తగిన విధంగా శిక్షించ కోరుతున్నాను,'' అన్నాడు.

ఆ మాటలకు రాజు జితకేతుడు ఆశ్చర్యపోతూ, మంత్రితో, ''మహామంత్రీ, ఇవేం అవివేకమైన పలుకులు? నా యీ పదేళ్ళ పరిపాలనలో నిందితుడెవడూ యిలా దురుసుగా మాట్లాడటం వినలేదే!'' అన్నాడు.

మంత్రి కోపంగా చేయి ఎత్తి, ''ఏయ్, పొగరుబోతా! మహారాజుగారి అనుమతి లేకుండా మాట్లాడినందుకు, నీకు యీ క్షణంలోనే శిరశ్ఛేద శిక్ష విధించవలసి వుంది. అయినా, నువు ఎవరివైనదీ ముందుగా తెలుసుకోవలసి వున్నది గనక, బతికిపోయావు. చంద్రశిలానగర రాజ్యపు





అరణ్యంలోని దారి దోపిడిగాళ్ళను, ఉదయగిరి రాజ్యంలో ప్రవేశపెట్టిన వాడివి నువ్వేనా? నీ పేరేమిటి?'' అన్నాడు.

''నా పేరు కాళీవర్మ. నేనీ రాజ్య పౌరుణ్ణే! గ్రామాలమీద పడి ప్రజల ధన ధాన్యాలు దోచుకునే దొంగల్ని, ఆ గ్రామస్థుల సాయంతో ఎదుర్కొని, వాళ్ళల్లో కొందరిని చంపిన మాట నిజమే. ప్రాణ భయం కొద్దీ మిగిలిన వాళ్లు సరిహద్దు దాటి ఉదయగిరి రాజ్యపు అరణ్యాల్లోకి పారిపోయి వుంటారు. అందుకు నేనెలా బాధ్యుణ్ణవుతాను?'' అన్నాడు కాళీవర్మ.

ఆ జవాబుకు మంత్రి మరింత కోపం తెచ్చుకుని, ''మహారాజా, నే నడిగిన చిన్న ప్రశ్నకు నిందితుడు అంత ఘాటైన పెద్ద జవాబివ్వటమే కాక, ఎదురుప్రశ్నలు కూడా వేస్తున్నాడు. ఆలశ్యమెందుకు, నిందితుణ్ణి తగిన విధంగా శిక్షించండి,'' అన్నాడు.

రాజు జితకేతుడు, కాళీవర్మ కేసి ఒక క్షణకాలం పరీక్షగా చూసి, ''ఇతడు మనం శిక్షించదలచిన కాళీవర్మే అన్న మాట! ఏయ్, వర్మా! నువ్వు నా అనుమతి లేకుండా, నా పౌరులైన కొందరిని చంపటమే గాక, పొరుగు రాజుతో కలహ కారణం అయినందుకు, నీకు మరణ శిక్ష విధిస్తున్నాను,'' అన్నాడు.

ఆ మాట వింటూనే కాళీవర్మ ఒక త్రుటికాలం నిర్విణ్ణుడయిపోయి, అంతలోనే తేరుకుని, ''మహారాజా, యిదే న్యాయసూత్రానికి అనుగుణమైన శిక్ష? నా తండ్రి తమ తండ్రిగారి కొలువులో సైనికోద్యోగిగా వుంటూ, ఒక యుద్ధంలో ప్రాణాలు కోల్పోయాడు. నేను తమ దగ్గిర ఉద్యోగం కోసం, పుట్టి పెరిగిన గ్రామం వదిలి యింతదూరం వచ్చాను. ప్రజా కంటకులైన బందిపోటు దొంగలను వేటాడినందుకు, నాకు మరణశిక్షా?'' అన్నాడు.

"ఇది అధిక ప్రసంగం," అని, మంత్రి సైనికులతో, ''మహారాజుగారి అజ్ఞ

విన్నారుగదా? ఈ కాళీవర్మను నగర పొలిమేరల్లోని దిరిసెన చెట్ల తోపులో ఉరి తీసి, శవాన్ని ఉదయగిరిరాజు దుర్ముఖుల వారి సన్నిధికి పంపండి,'' అన్నాడు.

మంత్రి యిలా అనగానే అక్కడ చేరిన జనంలో కలకలం బయలుదేరింది. వాళ్ళల్లో కొందరు పెద్దగా గొంతులెత్తి, ''ఇది అన్యాయం! మహారాజుగారు తాము విధించిన శిక్ష గురించి మరోసారి ఆలోచించాలి,'' అంటూ కేకపెట్టారు.

''మహారాజుగారికే సలహా లివ్వగలిగినంత వివేకులు నగరంలో వున్నారన్న మాట, ఆశ్చర్యం!'' అంటూ మంత్రి పళ్ళు కొరికి, సైనికులతో, ''ఆ కేకలు వేసే రాజద్రోహుల్ని పట్టి, ఖైదులో వేయండి,'' అన్నాడు.

మంత్రి యిలా అనగానే సైనికులు తమ గుర్రాలను గుంపులుగావున్న జనం కేసి ఉరికించారు. వాళ్ళు భయకంపితులై చెల్లా చెదురుగా పారిపోసాగారు. అది చూసి రాజు జితకేతుడు తృప్తిగా నవ్వి, ''దండనీతి ఒక్కటే, యీ అలగా జనాన్ని అదుపులో పెట్టగలదు. సమయానికి తగిన ఆజ్ఞయిచ్చారు, మహామంత్రీ!'' అంటూ మంత్రిని మెచ్చుకుని, తన భవనం కేసి బయలుదేరాడు. వెనకగా మంత్రి కదిలాడు.



జనాన్ని దూరంగా తరిమివేసింతరవాత అశ్వసైనికుల నాయకుడు, కాళీవర్మ దగ్గిరకు వచ్చి, ''రాజాజ్ఞ విన్నావుగదా? పాపం, ఇంత చిన్నవయసులోనే, నువ్వీ లోకం వదిలిపోతున్నందుకు, నాకు కాస్త విచారంగానే వున్నది. కాని, రాజాజ్ఞ, దానికి తిరుగులేదు,'' అన్నాడు.

కాళీవర్మ ఉగ్రుడైపోయి, కత్తి దూయబోయినవాడల్లా, ఇది అదనుకాదనుకుంటూ ఆగి, ''నువ్వనే రాజాజ్ఞ ఎంత బుద్ధిహీనమైనదో, యిక్కడ చేరిన నగరవాసులకు తప్ప, మీలో మరెవరికీ అర్థమైనట్టులేదు. పరాయి రాజుకు భయపడి ప్రజలకు మేలుచేసిన నన్ను, యీ జిత



కేతరాజు ఉరి తీయించబోతున్నాడు!'' అన్నాడు.

''రాజ్యక్షేమం రాజుకే తెలియాలి; నీకూ, నాకూ ఎలా తెలుస్తుంది? సరే, బయలుదేరు. నిన్ను ఉరితీసే దిరిసెన చెట్లతోపు చేరేలోపల రాజుగారు దయ తలచి, నీ శిక్ష రద్దుచేస్తూ ఆజ్ఞాపత్రం పంపినా పంపవచ్చు. లోగడ కొందరు నిందితులు ఆఖరిక్షణంలో, ఆ విధంగానే ఉరిశిక్షలు తప్పించుకున్నారు,'' అన్నాడు ఆశ్వికుల నాయకుడు.

కాళీవర్మకు అలాంటి ఆశ ఏమీలేదు. కాని, ఏదో విధంగా తాను ఉపాయంతో, యీ సైనికుల నుంచి పారిపోవాలను కున్నాడు. అందుకు నగరపొలిమేరలు దాటిన తరవాత ప్రయత్నించటం మంచి దన్న నిర్ణయానికి వచ్చాడు.

ఆశ్వికుల నాయకుడు తన అనుచరు లందర్నీ హెచ్చరించి, కాళీవర్మతో, ''నీ కిప్పుడు చేతులకు సంకెలలు తగిలించవలసివుంది; ఏదీ చేతులు చాచు,'' అంటూ దగ్గిరకు వచ్చాడు.

''ఇక కొద్ది క్షణాల్లో చావబోతున్న నాకు, ఈ సంకెళ్ళబెడద ఎందుకు? నేను పారిపోతాననే గదా, నీ భయం? ఇదిగో, కావాలంటే నా కత్తి తీసుకో. ఇంత మంది ఆయుధదారుల మధ్య నుంచి, నిరాయుధుడనైన నేను ఎలా తప్పించుకోగలను,'' అంటూ కాళీవర్మ ఒరనుంచి కత్తిని లాగి ఆశ్వికులనాయకుడికి యిచ్చాడు.

ఆశ్వికులనాయకుడు కత్తి తీసుకుని తృప్తిపడి, ''కాళీవర్మా, చావబోయేవాడి కోర్కె తీర్చటం పుణ్యం అన్నారు. ఒక వేళ నువ్వు పారిపోయేందుకు ప్రయత్నించావో, మేం పదిమంది ఆశ్వికులం! పదికత్తులు నీ శరీరాన్ని తూట్లుపొడిచి, నిన్ను పరలోకయాత్ర చేయించగలవు, జాగ్రత్త!'' అన్నాడు.

తరవాత కాళీవర్మను మధ్య వుంచి, ముందు ఐదుగురు ఆశ్వికులూ, వెనకగా ఐదుగురు ఆశ్వికులూ నగరపొలిమేరల

కేసి బయలుదేరారు. జనం జితకేతరాజు దుష్టత్వాన్ని గురించి మాట్లాడుకోసాగారు.

ఒకగంట తరవాత అందరూ నగర పొలిమేరల్లోని దిరిసెనచెట్ల ప్రాంతాన్ని చేరారు. చిత్త ఒత్తుగా పెరిగిన ఆ చెట్లకు దాపుల్లో ఎత్తయిన కొండలున్నవి. ఒక కొండ చరియమీదినుంచి జలపాతం ఒకటి ఇరవై ముప్ఫై అడుగుల దిగువనున్న బండరాళ్ళమీద పడుతూ భయంకరంగా శబ్దం చేస్తున్నది.

ఆశ్వికులతో పాటు చెట్ల మధ్యకు పోతూనే కాళీవర్మ, "ఇక్కడా నన్ను, మీరు ఉరితీయబోతున్నది?" అన్నాడు, తప్పించుకు పోయేందుకు మార్గం ఏమిటా అని, నలుదిక్కులూ పరికించిచూస్తూ.

ఆశ్వికుల నాయకుడు, ఏదో జవాబివ్వబోయేంతలో, ఒక ఎనుబోతు మీద ఎక్కిన నల్లని ఆకారం ఒకటి వాళ్ల కంట బడింది. ఎనుబోతు మీద వున్నవాడు తల నుంచి కాళ్ళవరకూ నల్లని దుస్తులు ధరించివున్నాడు. వాటికి కళ్ళ దగ్గిర మాత్రం కంతలున్నవి.

ఆ ఎనుబోతు రౌతు చేతిలోవున్న గండ్ర గొడ్డలిని పైకెత్తి పట్టుకుని, ఆశ్వికుల కేసి వేగంగా వస్తూ, "ఎవరు, మీరు? ఈ ప్రధానతలారి లోగడ శిరశ్ఛేదం చేసినవాళ్ళ ప్రేతాలా లేక కొత్తగా తలలు నరికించుకోవటానికి వచ్చిన వాళ్లా?" అంటూ భీకరమైన కంఠస్వరంతో ప్రశ్నించాడు.



ఎనుబోతు తమ కేసి వేగంగా రావటం చూస్తూనే గుర్రాలు బెదిరి, పెద్దగా సకిలిస్తూ అటూ యిటూ పరిగెత్తినై. పారి పోయేందుకు యిది చక్కని అవకాశం అనుకుంటూ కాళీవర్మ తన గుర్రాన్ని ముందుకు దూకించబోయేంతలో, ఎను బోతు మీద వున్నవాడు మెరుపులా వచ్చి, గుర్రంకళ్ళెపు తాళ్ళను వడిసి పట్టుకుని, "దిరిసెన చెట్లంటే భూత ప్రేత పిశాచా లకు ఎంతో యిష్టం! అందుకే రాజుగారు దొంగలకూ, దేశద్రోహులకూ మరణ శిక్షలు యిక్కడ అమలు చేస్తున్నారు. నువు దొంగవా, దేశద్రోహివా?" అని ప్రశ్నించాడు.

"నేను ఆ రెంటిలో ఏదీకాదు. నువ్వే జాతి పిశాచానివి?" అన్నాడు కాళీవర్మ, కళ్ళెపుతాళ్ళను ఎనుబోతువాడి నుంచి లాక్కునేందుకు ప్రయత్నిస్తూ.

అంతలో అక్కడికి చెల్లా చెదరైన అశ్వికులందరూ వచ్చిచేరారు. అశ్వికుల నాయకుడు కోపంగా, ఎనుబోతు రౌతును, "ఒరే, ఈ గత్తరంతా ఏమిటి? నిన్నేమైనా పిశాచిపట్టిందా?" అన్నాడు కసురుతూ.

ఎనుబోతువాడు కాళీవర్మ గుర్రపు కళ్ళెంతాళ్ళను వదిలి, "నగరప్రధాన తలారినే ఒరే, అరే అంటున్నావా? రాజుగారు ఏ రోజన అయినా, నీకు శిరశ్ఛేద శిక్ష వేసి, నా దగ్గిరకు పంపవచ్చు. అప్పుడు నిన్ను నా మొండిగొడ్డలితో, ఎండు మోడును నరికినట్టు నరుకుతాను," అన్నాడు.

"తాగుబోతువెధవా, యీ అవమా నాన్ని నేను సహించను!" అంటూ అశ్వికుల నాయకుడు చప్పున కత్తి దూశాడు. అమరుక్షణం కాళీవర్మ మెరుపు వేగంతో తలారి చేతినుంచి గండ్ర గొడ్డలిని లాక్కుని, అశ్వికులనాయకుడి కంఠం మీద బలంగా కొట్టాడు.

అశ్వికులనాయకుడి తల తెగి కింద పడేంతలో, దూరం నుంచి, "జై, అది భల్లూకా! ధైర్యశాలివిరా, యువకా!" అన్నకేక వినిపించింది.— (ఇంకావుంది)





# గంధపు చెట్టు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్లి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు పడుతున్న ఈ శ్రమనుబట్టి ఎవరైనా నిన్ను అవివేకి అనుకోవచ్చు. కాని కొందరు అవివేకులు లాగే కనబడుతూ, అకస్మాత్తుగా వివేకం ప్రదర్శిస్తారు. అందుకు నిదర్శనంగా నీకు విక్రమవర్మ అనే రాజు ఉదంతం చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

విక్రమవర్మ మగధదేశానికి రాజు. అతని మంత్రి విషకుంభుడు. రాజు ఎంతటి సజ్జనుడో మంత్రి అంతటి దుష్టుడు. అతను దివాణం ఉద్యోగాలన్నిటిలోనూ తన బంధువులనూ, ఇష్టులనూ, భృత్యులనూ నియమించి, తన

## బేతాళ కథలు



ఇష్టానుసారం రాజ్యాంగాన్ని నడుపుతూ వచ్చాడు. అతను ఇతరత్రా ఎన్ని పాడు పనులు చేసినా, రాజు దగ్గిర మాత్రం ఎంతో వినయ విధేయతలతో మసలు కుంటూ, తన అసలు స్వరూపం రాజుకు ఏమాత్రమూ తెలియకుండా జాగ్రత్త పడ్డాడు.

మంత్రి అయినవాడికి అన్ని విషయాల లోనూ ఎంతో స్వేచ్ఛ ఇచ్చి, అతని తెలివి తేటలను దేశానికి అనుకూలంగా ఉపయోగించుకోవాలన్నది రాజు మతం. అందుచేత, విషకుంభుణ్ణి గురించి ఎప్పుడైనా వ్యతిరేకమైన అభిప్రాయాలు అస్పష్టంగా వినవచ్చినా రాజు వాటిని అంతగా పట్టించుకోక, తన మంత్రిని అన్నిపనులూ స్వేచ్ఛగా చేయనిచ్చాడు. ఇది మంత్రికి మరింత అవకాశాన్నిచ్చింది.

రాజు తనకు ఇచ్చిన స్వేచ్ఛను మంత్రి దుర్వినియోగపరచుకుని, ప్రజల జీవితాన్ని క్రమంగా కష్టాలలో ముంచి, వసూలయే పన్నులలో కొంతభాగం ఖజానాలో చేరకుండా తానే స్వాహా చేస్తూ, తన దుర్మార్గాన్ని నిరూపించగల వారిని కొందరిని చంపించి, మిగిలిన వారికి సింహస్వప్నంగా ఉంటూ వచ్చాడు.

విక్రమవర్మకు చిన్ననాటి గురువు రామశర్మకు మంత్రి చేస్తున్న దుర్మార్గాలన్నీ తెలుసును. ఎంతకాలానికీ రాజు మంత్రి మీద ఎలాంటి చర్యా జరపక పోవటం చూసి, మంత్రి సంగతి రాజుకు తెలిసి ఉండదని రామశర్మకు తోచింది. రాజును ఈ విషయమై హెచ్చరించే ఉద్దేశంతో రామశర్మ ఆయనను ఒకనాడు చూడవచ్చాడు.

రాజు తన గురువుకు భక్తిశ్రద్ధలతో స్వాగతం పలికి, కొంతసేపు కబుర్లు చెప్పుకున్న మీదట, ఆయన వచ్చిన పని అడిగాడు.

''ఏమీలేదు. రాజ్యం ఎలా ఉన్నదోనని పర్యటనచేసి చూస్తూ, ఇలా వచ్చాను,'' అన్నాడు రామశర్మ, తమ సమీపంలో

నిలబడి ఉన్న పెద్దలందరినీ ఒకసారి కలయజూసి.

''నా పరిపాలన ఎలా ఉన్నట్టు మీకు తోచింది?'' అని రాజు రామశర్మను అడిగాడు.

''చాలా బాగున్నది. ప్రజలందరికీ గంధపుచెట్టు లాగా నీడనిస్తూ, నీ మంచితనం అనే సువాసనలను వెదజల్లుతున్నావు,'' అన్నాడు రామశర్మ.

రాజు ఒక్క క్షణం పాటు గంభీరంగా ఆలోచించి, ''గురువర్యా, నా కళ్ళు తెరిపించినందుకు ధన్యవాదాలు,'' అని చెప్పి, ఆ రోజే తన మంత్రిని గురించి చారుల ద్వారా వివరాలు సంగ్రహించి, ఆ మరసటి రోజునే అతనిని పదవీభ్రష్టుణ్ణి చేశాడు.

అటు తరవాత ప్రజలలో వెల్లివిరిసిన ఉత్సాహం చూసి, రాజు తాను తీసుకున్న చర్య సరి అయినదేనని తెలుసుకోగలిగాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, నాకు సందేహాలున్నాయి. రాజగురువు రామశర్మ రాజును హెచ్చరించే ఉద్దేశంతో వచ్చాడు గదా, పల్లెత్తుమాట మంత్రిని గురించి అనకుండా, పైపెచ్చు రాజు యొక్క పాలనను ఎందుకు మెచ్చుకున్నాడు? మరొక సందేహం: అంత




కాలమూ తన మంత్రిని గురించి అపవాదులు వింటూ కూడా ఆ మంత్రి మీద ఎలాటి చర్యలూ తీసుకోకుండా, రామశర్మతో ఇంకేదో విషయం మాట్లాడిన ఫలితంగా మంత్రిని తొలగించటం ఎలా జరిగింది? ఈ రెండు అనుమానాలకూ సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రామశర్మ తాను వచ్చిన పని దాట వెయ్యలేదు. అయితే అతను రాజును సూటిగా హెచ్చరించక తన హెచ్చరికను వ్యంగ్య రూపంలో రాజుకు అందజేశాడు. అందుకు చాలా కారణాలున్నాయి. ఒకటి, రామ

శర్మ రాజును ఏకాంతంగా కలుసుకో లేదు. రాకరాక వచ్చిన తన చిన్ననాటి గురువును రాజు సహజంగా నలుగురు పెద్దల సమక్షంలో కలుసుకున్నాడు. రామ శర్మ రాజుతో, 'మనం కాస్సేపు ఏకాం తంగా మాట్లాడాలి', అనవచ్చు. కాని వెంటనే మంత్రి రహస్యం గ్రహిస్తాడు. అతను సర్వస్వతంత్రుడుగా వ్యవహరి స్తున్నాడు గనక, రాజుకు అపచారం చేసినా చెయ్యగలడు. ఈ కారణాలవల్ల రామశర్మ తన హెచ్చరికను వ్యంగ్య రూపంలో అందించ నిశ్చయించాడనుకో వాలి. అంతేకాదు, రాజులో చిన్నతనపు చురుకు తనం ఇంకా ఉన్నదో, లేక అతను ఆ మధ్యకాలంలో మందమతి అయాడో రామశర్మకు తెలీదు. అతని బుద్ధి ఇంకా సూక్ష్మంగా ఉన్న పక్షంలో హెచ్చరిక వ్యంగ్యంగా ఉన్నప్పటికీ నష్టం ఉండదు. అలాకాక రాజు మందమతి అయిపోయి, విషకుంభుడి చేతికీలు బొమ్మ అయి ఉంటే సూటిగా హెచ్చరించి కూడా లాభం ఉండదు. పైపెచ్చు తనకే ప్రమాదం కలగవచ్చు. ఎన్నివిధాల చూసినా రామశర్మ అవలంబించిన వైఖరి చాలా తెలివైనదిగా కనబడుతుంది. అతను చెయ్యదలచిన హెచ్చరిక చెయ్యనే చేశాడు. గంధపుచెట్టు నీడలో విషసర్పాలు చేరుతాయి, దాని సువాసనలు ఆ విష సర్పాలను ఆకర్షిస్తాయి. ఈ హెచ్చరిక రాజు వెంటనే గ్రహించి, గురువుగారికి ధన్యవాదాలు చెప్పుకున్నాడు. రామశర్మ చెప్పిన దానికీ, రాజు తన మంత్రిని గురించి లోగడవిన్న అపవాదులకూ ఎంతో తేడా ఉన్నది. రామశర్మ ఈ హెచ్చరికను వ్యంగ్యంగా చెయ్యవలసి రావటాన్నిబట్టి, పరిస్థితి తీవ్రంగా ఉన్నదని కూడా రాజు వెంటనే గ్రహించగలిగాడు. అందు చేతనే అతను వెంటనే తగిన చర్యలు తీసుకున్నాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# వింత బాకీదారు

ఒక గృహస్థు తన కూతురికి ఆర్భాటంగా పెళ్ళిచేసి, అప్పులపాలై, దివాలా తీశాడు. అతను తన ఆస్తి అంతా ఊళ్ళోని పదిమంది పెద్దమనుషుల పరంచేసి, సాధ్యమైనంత వరకు న్యాయంగా తన బాకీలు తీర్చవలసిందని కోరాడు.

ఈ మాట తెలిసి బాకీ దార్లందరూ పెద్ద మనుషుల వద్దకు వచ్చి, తమ బాకీలు నిరూపించుకుని, పద్దు వేయించుకుంటున్నారు.

ఒక పెద్దమనిషి వచ్చి తనకు గృహస్థునుంచి రావలసిన బాకీ పదిహేను రూపాయలన్నాడు. తాను పెళ్ళిలో పదిహేను రూపాయలు చదివించాననీ, గృహస్థు దివాలా ఎత్తుతున్నాడు గనక తనకు ఈ జన్మలో ఆయన తిరిగి చదివించే అవకాశం లేదనీ, అందుచేత తనకు ఆయన రుణపడినట్టేననీ పెద్దమనిషి అన్నాడు.

"దివాలా ఎత్తిన మనిషి విందుభోజనాలు బాగా పెట్టాడటగదా?" అని పెద్దలు అడిగారు.

"ఆహా! విస్తరి అయిదు రూపాయల భోజనం!" అన్నాడు పెద్దమనిషి.

"మీ ఇంటి నుంచి పెళ్ళికి ఎందరు వచ్చారు?" అని పెద్దలు అడిగారు.

"నలుగురం!" అన్నాడు బాకీదారు.

"అలా అయితే నువే గృహస్థుకు అయిదు రూపాయలు బాకీ ఉన్నావు. వెంటనే చెల్లించు," అన్నారు పెద్దలు.

—లక్ష్మి వసుంధర






శ్రీపురం జమీందారు ఈశ్వరయ్య పరమ లోభి. గౌరి ఈశ్వరయ్యకు ఒకతే కూతురు. గౌరికి పెళ్ళి ఈడు వచ్చింది. తన ఆస్తికంతకూ వారసురాలైన గౌరికి, తనను మించిన పొదుపరిని భర్తగా తెచ్చి, ఇల్లరికం ఉంచుకోవాలని ఈశ్వరయ్య ఉద్దేశం. వరుడికి పటాటోపాలూ, ఆడంబరాలూ, అందచందాలూ కూడా ముఖ్యం కాదు.

ఇదంతా ఈశ్వరయ్య పెళ్ళిళ్ళ పేరయ్యకు వివరించి చెప్పి, పనికివచ్చే వరులను తీసుకురమ్మన్నాడు. పేరయ్య చాలామంది కుర్రవాళ్ళను తెచ్చాడు. లోపలికి వచ్చేవాళ్ళు ఇంటిముందున్న పెద్ద అండలోని నీళ్ళతో కాళ్ళు కడుక్కుని లోపలికి వచ్చేవాళ్ళు. పేరయ్య వెంటవచ్చే కుర్రవాళ్ళు కాళ్ళు కడుక్కోవటానికి ఎన్ని చెంబుల నీళ్ళు ఉపగించినదీ ఈశ్వరయ్య గమనించేవాడు. నీటిపొదుపు తెలియనివాడికి జీవితంలో ఏ పొదుపూ తెలియదని ఈశ్వరయ్య నమ్మకం. ఈ ప్రమాణాన్నిబట్టి పేరయ్య తెచ్చిన ఒక్క యువకుడూ ఈశ్వరయ్యకు నచ్చలేదు.

చివరకు పేరయ్యకే ప్రాణంవిసిగి ఏ కుర్రాణ్ణీ తీసుకురావటం మానేశాడు. గౌరికి కూడా తన తండ్రి ధోరణి అర్థం కాలేదు. తన పెళ్ళిచేసే ఉద్దేశం ఆయనకు లేదుకాబోలు ననుకున్నది. ఎందుకంటే, గౌరి సంతోషంగా పెళ్ళాడ గల యువకులను కూడా ఈశ్వరయ్య తిప్పి కొట్టేశాడు. ఆయన తన కూతురి అభిప్రాయం ఒక్కసారయినా అడిగిన పాపానపోలేదు. ఇక ఈ జన్మలో తనకు పెళ్ళికాదని రూఢిచేసుకుని ఆమె తన గోడు ఒక స్నేహితురాలికి చెప్పుకున్నది.

గవ్వల నిర్మలాదేవి

గౌరి స్నేహితురాలు ఉమకు అన్నవరస అయిన యువకుడు చుట్టపు చూపుగా వచ్చి, పక్కగదిలో ఉండి, గౌరి ఉమతో చెప్పిన మాటలన్నీ విన్నాడు.

తరవాత రెండు రోజులకు పేరయ్య మరొక యువకుణ్ణి తీసుకుని ఇంకోసారి ఈశ్వరయ్య ఇంటికి వచ్చాడు. పేరయ్య కాళ్ళు కడుక్కున్నాడుగాని, యువకుడు కడుక్కోకుండానే లోపలికి వచ్చాడు. నిజానికి ఆ యువకుడి పాదాలకు ఏవో చిత్తుకాగితాలు చుట్టి ఉన్నాయి; అది చూసి, అతని కాళ్ళకు పాడలు ఏవైనా ఉన్నాయోమోనని ఈశ్వరయ్యకు అనుమానం కలిగింది. అతను సరికొత్త పాదరక్షలను చేతిలోపట్టుకుని ఉన్నాడు.

ఈశ్వరయ్య కాళ్ళు కడుక్కుని రమ్మని అంటున్నా వినిపించుకోకుండా ఆ యువకుడు లోపలికివచ్చి కుర్చీలో కూర్చున్నాడు. అతనికి పాడల వ్యాధి లాంటి దానితోబాటు చెవుడు కూడా ఉన్న దేమోనని ఈశ్వరయ్యకు అనుమానం కలిగింది.

ఆ యువకుడు కూర్చుని, కాళ్ళకు చుట్టిన చిత్తుకాగితాలు తీసేస్తూ, "కాళ్ళు కడుక్కోనందుకు మరోలా అనుకోకండి. బయటికి వెళ్ళి, లోపలికి వచ్చినప్పుడల్లా కాళ్ళు కడుక్కుని నీరు వృథా చెయ్యటం నా కిష్టం లేదు. అందుకని పాదాలకు ఇలా చిత్తు కాగితాలు చుట్టుకుంటాను," అన్నాడు.



అతని పాదాలు నిక్షేపంలాగున్నాయి. చెవుడు లేదని కూడా తేలిపోయింది. ''జోళ్ళున్నాయిగా? అవి తొడుక్కొని తిరగకూడదూ?'' అన్నాడు ఈశ్వరయ్య.

''జోళ్ళు కొన్నది వేసుకుని అరగ దీయటానికా?'' అన్నాడు యువకుడు.

''అలాటప్పుడు డబ్బు ఖర్చు చేసి జోళ్ళు కొనకపోతేనేం? మొయ్యటం తప్పేదిగా?" అని ఈశ్వరయ్య అడిగాడు.

యువకుడు కోపం తెచ్చుకుని, ''కాలికి జోళ్ళు కూడా కొనుక్కోలేనంతటి దరి ద్రుడనని మీ బోటి వాళ్ళు అనుకుని పోతారేమోనని వాటిని కొని చేత్తో పట్టుకు తిరుగుతున్నాను. కాళ్ళతో మోస్తే గొప్పా, చేత్తో మోస్తే తక్కువా ఎలా అవుతుంది?" అన్నాడు.

ఈశ్వరయ్యకే యువకుడి పొదుపు చూసి తల తిరిగినట్టయింది. అయినా ఒక సందేహం మిగిలిపోయి ఆయన, ''బాబూ, కోపం తెచ్చుకోనంటే ఒక్క మాట అడుగుతాను. ఈ చిత్తు కాగితాలైనా ఊరికే రావుగద. వాటికి కూడా ఏదో లెక్కన ధర వుంటుందిగద. వాటిని వృథా చెయ్యటం-" అంటూ ఏదో అనబోయాడు.

యువకుడు అడ్డుతగిలి, ''మీ రింకా పెరటిదారినే ఉన్నారు. రోజూ నాకు వంట ఎలా అవుతున్నదనుకుంటున్నారు? ఈ చిత్తు కాగితాలతోనే!'' అన్నాడు.

ఈశ్వరయ్యకి కొంతసేపు నోట మాట రాలేదు. తరవాత ఆయన గౌరిని ఆ యువకుడికి ఇచ్చి, పెళ్ళి చేశాడు.

అయితే తన అల్లుడి అసలు రూపం ఈశ్వరయ్య ఎరగడు. అతని పేరు రామేశం. అతను పెళ్ళిచూపులకు వచ్చే ముందు ఈశ్వరయ్య పిసినిగొట్టుతనం గురించి ఆరాతీశాడు. ఎంత మంచి సంబంధాలను కూడా ఈశ్వరయ్య ఎందుకు తిరగగొట్టి ఉంటాడో సరిగా ఊహించి, ఈశ్వరయ్య దౌర్బల్యానికి తగిన పథకం ఆలోచించి, పెళ్ళిళ్ళ పేరయ్య సహాయంతో దాన్ని ప్రయోగించి నెగ్గాడు.





# పిశాచినాటకం

ఒక ఊళ్ళో మంగయ్యశెట్టి అనే వడ్డీ వ్యాపారస్తుడు అంతులేని ధనం కూడబెట్టి, దాన్ని తన కొడుకు గోవిందశెట్టికి భద్రంగా అప్పగించి కన్నుమూశాడు. కళ్ళారా చూసినదాకా తన తండ్రి అంత ఆస్తి సంపాదించినట్టు గోవిందశెట్టికి తెలియదు. అతను ఇనపపెట్టె తీసి, అందులో ఉన్న వెండీ, బంగారమూ, నగలూ కుప్పపోసి చూసుకుంటే గుండె దడదడలాడింది. తండ్రి యిచ్చిపోయిన అంత ధనాన్ని దొంగల బారినుండి కాపాడుకోవటం మాటలు కాదు.

దాన్ని క్షేమంగా ఉంచటానికి గోవిందశెట్టి ఒక ఆలోచన చేశాడు. ఆ ధనమంతా రెండు లంకెబిందెల నిండా పోసి, అర్ధరాత్రి వేళ ఆ బిందెలను తీసుకుపోయి, ఊరి బయట ఉండే దయ్యాల మర్రి కింద పాతి పెట్టాడు. ఆ మర్రిచెట్టు మీద దయ్యాలుంటాయన్న నమ్మకం మూలాన రాత్రివేళ ఆ చాయలకు ఎవరూ వెళ్ళరు. తన డబ్బును రక్షించుకోవటం కోసం గోవిందశెట్టి పిశాచాల భయాన్ని దూరంగా ఉంచటమే గాక, తానే ఒక పిశాచం పాత్ర ధరించాడు!

ఎందుకంటే తాను పాతిపెట్టిన ధనానికి రాత్రి పూట తానే కాపలా కాయాలి. అందుకోసం గోవిందశెట్టి చీకటిపడినాక ఎవరూ చూడకుండా నిలువునా తెల్ల బట్టలు ధరించి పిశాచం వేషం వేసుకుని, కాళ్ళకు గజ్జెలు కట్టుకుని, వింత వింత ధ్వనులు చేస్తూ, మర్రిచెట్టు నీడలో మసలేవాడు. రాత్రి అంతా అలా తిరిగి, అతను తెల్లవారు జామున ఇల్లు చేరుకునేవాడు.

మర్రిచెట్టు కింద దయ్యంలాటిది తారట్లాడుతున్నట్టు పుకారు పుట్టింది.

బూర్లె నాగేశ్వరరావు



తన తండ్రి పిశాచమై మర్రిచెట్టును ఆశ్రయించినట్టు గోవిందశెట్టి ఊరంతా ప్రచారం చేశాడు. అంతవరదాకా మర్రి చెట్టు మీద పిశాచాలున్నాయన్న పుకారే తప్ప, ఇప్పుడు పిశాచాన్ని స్వయంగా చూసినవాళ్ళున్నారు. మంగయ్యశెట్టి పిశాచమై, మర్రిచెట్టును ఆశ్రయించాడన్న నమ్మకం ఊరందరికీ కలిగింది. ఈ కారణంగా చీకటి పడితే ఇల్లు దాటి బయటికి రావటానికి అందరూ భయపడుతున్నారు. మర్రిచెట్టు ప్రాంతాల పిశాచం ఉన్నట్టు చూసినవారు కొందరికి జ్వరాలు వచ్చాయి. మంగయ్యశెట్టి పిశాచం గురించిగోరంతలు కొండంతలుగా ఊళ్ళో చెప్పుకోసాగారు.

ఊరి పరిస్థితి మారిపోయింది. పనులు పాడు అయాయి. పొలాలకు రాత్రిపూట కాపలా లేదు. పొరుగూళ్ళ దొంగలు ఫంటలు యధేచ్ఛగా దోచుకుపోసాగారు. ఊళ్ళో ఏ మనిషికిగాని, గొడ్డుకుగాని జబ్బు చేసినా, చావు సంప్రాప్తమైనా అది పిశాచం పనేనని అందరూ నమ్మారు. గ్రామజీవితం అస్తవ్యస్తమయింది.

గ్రామంలో దరిద్రం తాండవించటం కూడా గోవిందశెట్టికే లాభించింది. తన వద్ద ఉన్న సరుకు హెచ్చు ధరలకు అమ్మి, అతను మరింత లాభాలు చేసుకో నారంభించాడు. అతను గ్రామస్థుల మీద కనికరించి, తన పిశాచం వేషం మానుకోక, ఆ వేషంతో కాపలా కాస్తూనే ఉన్నాడు.

ఈ స్థితిలో చిన్నడు తన కుక్కతో సహా ఆ గ్రామం చేరాడు. ఊరిలో అడుగు పెడుతూనే అతను మంగయ్యశెట్టి పిశాచం గురించీ, దాని మూలాన గ్రామానికి పట్టిన పీడ గురించీ విన్నాడు. అతనికి చాలా బాధ కలిగింది. జనానికి పిశాచాల భయం లేకుండా చేస్తే తప్ప వారి జీవితాలు బాగుపడవు. తాను ఆ పనికి పూనుకునే ముందు మంగయ్యశెట్టి పిశాచాన్ని ఒకసారి చూడాలనుకున్నాడు. అప్పుడుగాని దాన్ని గురించి ఏదో ఒకటి చెయ్యటం సాధ్యం కాదు.

ఆ రాత్రి అతను నిర్జనంగా ఉన్న దయ్యాల మర్రిని చేరి, దానిమీద ఎక్కి కూర్చున్నాడు. అర్ధ రాత్రి అయేసరికి గోవిందశెట్టి చెట్టు కిందికి రావటమూ, పిశాచం వేషం వేసుకోవటమూ, చెట్టు నీడలో తారట్లాడటమూ చిన్నడికి కనిపించింది.

ఎవరో మంగయ్యశెట్టి పిశాచంలా నటిస్తూ, ప్రజలను భయభ్రాంతులను చేస్తున్నారు! ఎందుకు? ఇందులో ఆ మనిషి స్వార్థం ఏదో ఉండాలి. తన స్వార్థం కోసం ప్రజలను నానా క్షోభలకూ గురిచేస్తున్న ఈ కిరాతకుణ్ణి తప్పకుండా ప్రజలముందుకు ఈడ్చాలి. అప్పుడుగాని వాళ్ళకు పిశాచభయం పోదు.

తెల్లవారు జామున గోవిందశెట్టి ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు చిన్నడు అతని వెనకగా వచ్చి, ఆ ఇల్లుగలవాణ్ణి గురించి వాకబు చేశాడు. గోవిందశెట్టి మంగయ్యశెట్టి కొడుకేననీ, మంగయ్యశెట్టి అంతులేని డబ్బు సంపాదించి చచ్చాడనీ, అతను ఇప్పుడు పిశాచం అయాడనీ ఊరివాళ్ళు చిన్నడికి తెలిపారు.

తన తండ్రి పిశాచం అయాడని ప్రచారం చేసి, ఆ వేషంతో తాను ప్రజలను హడలగొట్టటంలో గోవిందశెట్టి అభిప్రాయం ఏమై ఉంటుందని చిన్నడు తీవ్రంగా ఆలోచించాడు. తన ఇంట్లో ఉన్న ధనపు రాసులను దొంగలు దోచుకుపోతారన్న భయం కూడా లేకుండా, గోవిందశెట్టి





రాత్రివేళ మర్రిచెట్టు కింద కాపలా కాయటానికి బలమైన కారణం ఏదో ఉండాలి.

ఆ రోజు కనుచీకటి వేళ చిన్నడు గడ్డాలూ, మీసాలూ పెట్టుకుని గోవిందశెట్టి ఇంటికి వెళ్ళి, "మంగయ్యశెట్టీ! మంగయ్యశెట్టీ!" అని కేకపెట్టాడు.

గోవిందశెట్టి తలుపు తీసి, చిన్నడిని ఒకక్షణం తేరిపారజూసి, "ఏం కావాలి? నువ్వెవరు?" అని అడిగాడు.

"నేను జోగిందర్ కొడుకును. మంగయ్యశెట్టి కావాలి," అన్నాడు చిన్నడు, కుర్చీమీద కూర్చుంటూ.

చిన్నడి చొరవకు గోవిందశెట్టి విస్తుపోయి, "ఆయన మా నాన్నగారు. ఆయన పోయి చాలా రోజులయింది. ఆయనతో ఏం పని?" అన్నాడు.

చిన్నడు కొద్దిగా విచారం ముఖం పెట్టి, "మా నాన్నగారికి మీ నాన్నగారు లక్షవరహాలు బాకీ ఉన్నారు. వాటికోసమే వచ్చాను. ఆ డబ్బు యిచ్చి, నన్ను తొందరగా పంపించే ఏర్పాటుచూడు," అన్నాడు.

గోవిందశెట్టి ఉలిక్కిపడి, "ఆఁ? ఏమిటీ? మా నాన్నగారు మీ నాన్నగారికి లక్ష వరహాలు బాకీ ఉన్నాడా? ఆ డబ్బు నీకు నేను ఇయ్యాలా? బాగుంది! ఉండటానికి ఈ ఇల్లు తప్ప నా దగ్గిర చిల్లిగవ్వ లేదు. కావలిస్తే చూసుకో. నాకు బతుకు వెళ్ళమారటమే అంతంత మాత్రంగా ఉన్నది." అంటూ చిన్నడికి ఇంట్లో ఉన్న ప్రతిపెట్టే, ఇనప్పెట్టెతో సహా, చూపించాడు.

అంతా చూసిన మీదట చిన్నడికి సంగతి ఏమిటో పూర్తిగా అర్థమైపోయింది. గోవిందశెట్టి తనకు ఉన్నదంతా దయ్యాల మర్రి సమీపంలో దాచి, రాత్రిపూట పిశాచి వేషం వేసి, అక్కడ కాపలా కాస్తున్నాడు; అటుకేసి ఎవరూ రాకుండా కూడా చూసుకుంటున్నాడు!

ఈ సంగతి గ్రహించిన చిన్నడు, "చూడు, గోవిందశెట్టీ! బాకీ అన్న తరవాత బాకీయే! నీ ఇల్లూ అదీ అమ్మేసి

అయినా మా నాన్న బాకీ తీర్చటం మంచిది. మా నాన్న సంగతి నీకు తెలీదు!" అని బెదిరించాడు.

గోవిందశెట్టి మండిపడి, "ఇంకోసారి ఆ మాట అన్నావంటే నీ ప్రాణాలు దక్కవు! మా నాన్న ప్రస్తుతం పిశాచమై తిరుగుతున్నాడు. మంగయ్యశెట్టి పిశాచం పేరు చెబితే ఈ ప్రాంతంలో కప్పలు కూడా నీళ్ళు తాగవు! మీ జోగిందర్ ఏం చెయ్యగలడు?" అన్నాడు.

చిన్నడు పకపకా నవ్వి, "అదా నీ ధైర్యం? మా నాన్న కూడా చచ్చి పిశాచమై, మా ప్రాంతాల విలయ తాండవం చేస్తున్నాడు. పిశాచి అయినాక తనకు రావలసిన బాకీలన్నీ ఒకటొకటే వసూలు చేస్తున్నాడు. మొండికెత్తిన వాళ్లచేత నెత్తురు కక్కిస్తున్నాడు. ఆయన మీ నాన్న మీద విరుచుకు పడతాడనే భయంతోనే బాకీ వసూలుకు నేను స్వయంగా బయలుదేరి వచ్చాను. నన్ను ఉత్త చేతులతో వెనక్కు పంపావో, నీ ప్రాణానికి నేను పూచీపడను! నువు డబ్బు లేదని నన్ను మోసగించగలవు గాని, డబ్బు ఎక్కడ ఉన్నదీ పిశాచానికి తెలియదా? ఆ సంగతి నీకు తెలియదా? వెళ్ళివస్తా!" అంటూ బయటపడ్డాడు.

గోవిందశెట్టికి మతిపోయినట్టయింది. పిశాచంగా నటిస్తూ మనుషులను హడలగొట్టవచ్చుగాని, నిజంగా పిశాచం వెంటబడితే తన గతి ఏం కాను?



అయినా ఆ రాత్రి గోవిందశెట్టి మర్రి చెట్టు కిందికి వెళ్ళి పిశాచం వేషం వేశాడు. కాని కాళ్ళు వణుకుతున్నాయి. జోగిందర్ పిశాచం తన డబ్బుకోసం రావచ్చు. ఈ నిర్జనప్రదేశంలో పిశాచాన్ని ఎదుర్కొనేకన్న, తన డబ్బు తన ఇంటికే తీసుకుపోవటం మేలు. ఊరి మధ్య పిశాచాల భయం తక్కువ. పిశాచాల భయం కన్న దొంగల భయం కూడా తక్కువే.

గోవిందశెట్టి తాను ధనం పాతినచోట తవ్వి, లంకెబిందెలు పైకి తీశాడు. అంతలో చెట్టు మీది నుంచి చిన్నడు గోవిందశెట్టి ముందు దూకాడు. గోవింద శెట్టి భయంతో కెవ్వున అరిచాడు. చిన్నడు అతన్ని పట్టుకుని మర్రిచెట్టుకే కట్టేసి, అతనికి తన కుక్కను కాపలా పెట్టి, ఊళ్ళోకి వెళ్ళి, "మంగయ్యశెట్టి పిశాచాన్ని చూపిస్తాను, రండి!" అని జనాన్ని పిలుచుకొచ్చాడు. వాళ్ళు గోవిందశెట్టిని గుర్తించి నివ్వెరపోయారు.

"చచ్చిపోయిన మంగయ్యశెట్టి ఎన్నో అక్రమాలు చేసి ఇంత డబ్బు సంపాదించి ఉంటాడని ఊళ్ళో ఎవరూ ఊహించి ఉండరు. ఆ సంగతి గ్రామస్థులకు తెలియకుండా ఉండగలందులకు ఈ గోవిందశెట్టి, తన తండ్రి సంపాదన అంతా లంకెబిందెలలో పెట్టి ఇక్కడ దాచి, తన తండ్రి పిశాచం అయినట్టు మిమ్మల్ని నమ్మించి, వీటికి రాత్రివేళ కాపలా కాస్తున్నాడు. ఇందులో ఊళ్ళో వాళ్ళు పోగొట్టుకున్న దొంగసొత్తు ఎంత ఉన్నదో మీరే నిర్ణయించుకుని, ఎవరిది వారికి తిరిగి ఇచ్చెయ్యండి. మీరు దయ్యాలూ, పిశాచాలూ అని భయపడినంత కాలమూ మిమ్మల్ని ఎవరుపడితే వాళ్లు, తేలికగా మోసం చెయ్యగలరు. మీ బతుకులు బండలైపోతాయి!" అన్నాడు చిన్నడు.

చిన్నడు గోవిందశెట్టినీ, లంకెబిందెలనూ గ్రామాధికారికి అప్పజెప్పి, తాను కుక్కతో సహా బయలుదేరి వెళ్లిపోయాడు.





# పట్నంగాలి

తిమ్మయ్య బాగా జరుగుబాటు ఉన్న వాడు. అతడికి పంట పొలాలతోబాటు, కొబ్బరి, మామిడి మొదలైన తోటలు కూడా ఉన్నాయి.

తిమ్మయ్య మేనల్లుడు కేశవులు, పదేళ్ళ వయసులోనే తల్లిదండ్రులిద్దరినీ పోగొట్టుకుని, తిమ్మయ్య ఆదరణలో పెరుగుతూ వచ్చాడు. తిమ్మయ్య వారం, వారం, కూరగాయలూ, ఆకుకూరలూ, పళ్ళూ ఎడ్ల బండిలో వేసుకుని సంతకు తీసుకెళ్ళి అమ్ముతూ, కేశవుణ్ణి కూడా వెంట తీసుకుపోతూండేవాడు. బండిలో ఉన్న కేశవుడు ఏ పండో, కాయో నోట్లో వేసుకుంటే తిమ్మయ్య ఏమీ అనేవాడు కాడు. పైపెచ్చు, ఇంకా రెండు తినమనే వాడు. కాని, పట్నం పొలిమేర చేరుకున్నాకా, సంతలోనూ అతని ధోరణి మారిపోయేది; పనికిరాని పిందెను ముట్టుకున్నా కసురుకుని, "దాన్ని అమ్మితే నాలుగు పైసలైనా వస్తుంది, తింటే ఏమొస్తుంది?" అనేవాడు. మళ్ళీ తిరుగు ప్రయాణంలో పట్నం పొలిమేర దాటగానే మామూలు మనిషి అయేవాడు.

కేశవుడు పెద్దవాడయినాక తిమ్మయ్య తన కూతురు లక్ష్మిని వాడికిచ్చి పెళ్లి చేసి, "ఒరే, కేశవా! నిన్నొక ఇంటివాణ్ణి చేశాను. ఇక నీకు పిల్లా జెల్లా పుట్టుకొస్తారు. వాళ్ళ కోసం నువు దండిగా డబ్బు సంపాదించాలి గదా! పల్లెల్లో ఏముంది? పట్నంలో అయితే రెండు చేతులా ఆర్జించవచ్చు. కావలసిన డబ్బు పట్టుకెళ్లి, పట్నంలో ఏదైనా వ్యాపారం మొదలెట్టు," అన్నాడు.

పల్లెను విడిచి వెళ్ళటం కేశవుడికి ఇష్టం లేదు. వ్యవసాయం చేసుకుంటూ హాయిగా ఉందామని వాడి ఉద్దేశం. వాడు

కలువ "లను సగానంగ

తన మామతో, "నేను పట్నం వెళ్లి పోతే, ఇక్కడ పొలం పనులు ఎవరు చూసుకుంటారు? నువ్వేమో పెద్దవాడివై పోతివి?" అన్నాడు.

తిమ్మయ్య వాడిమాట వినక, "నాకేం? ఉక్కుపిండంలా ఉన్నాను! ఇక్కడి పనులన్నీ నేను చూసుకుంటాను గదా! నువు పట్నం వెళ్లి వ్యాపారం చెయ్యాల్సిందే," అంటూ పట్టుబట్టాడు.

కేశవుడు తన భార్యతోసహా పట్నం వెళ్లి, అక్కడ ఒక "ఉపాహార భోజన శాల" ప్రారంభించాడు. రెండు నెలలు గడిచాయి. అన్నిపనులూ తానే చూసుకోవటంతో ఊపిరి సలపకుండా ఉన్న తిమ్మయ్య ఎలాగో వీలు చూసుకుని, పట్నం బయలుదేరి, ముందు అల్లుడి వ్యాపారం చూసి, తరవాత కూతురి కాపరం చూద్దామనుకున్నాడు.

భోజనశాలలో ఉన్న కేశవుడు తిమ్మయ్యను అంగడి వీధిలో దూరానే చూసి, ఒక పనివాడితో, "ఇప్పుడే వస్తాను. అంతదాకా వ్యాపారం చూస్తూ ఉండు. డబ్బులు ఖచ్చితంగా వసూలు చెయ్యి," అంటూ ఎటో వెళ్ళిపోయాడు.

తిమ్మయ్య భోజనశాలలో ప్రవేశించి, కేశవుడు అప్పుడే ఎటో వెళ్ళాడని తెలుసుకుని, బల్లముందు కూర్చుని, తనకు కావలసిన ఫలహారాలు తెప్పించుకుని తిని, లేచి బయలుదేరుతూ, "నేను వెళ్లి అమ్మాయిని చూడాలిగానీ, కేశవుడు



వస్తే, నేను వచ్చానని చెప్పు,'' అంటూ పనివాడితో అన్నాడు.

''డబ్బిచ్చి వెళ్ళవయ్యా!'' అన్నాడు పనివాడు.

''డబ్బు దేనికీ? ఈ దుకాణం మా అల్లుడిదేకదా!'' అన్నాడు తిమ్మయ్య.

''ఇలాటి వాళ్ళను చాలామందిని చూశాం! ముందు డబ్బిచ్చి *కదులు.'' అంటూ పనివాడు తిమ్మయ్య కండువా పట్టుకున్నాడు.

''డబ్బు తీసుకురాలేదే!'' అంటూ తిమ్మయ్య నీళ్ళు నమిలాడు.

కేశవుడు తిరిగి వచ్చేసరికి, లోపల వంటసాలలో పిండి రుబ్బుతూ తిమ్మయ్య కనిపించాడు. అతను, ''చూశావుట్రా, అల్లుడూ, నాకు వచ్చిన తిప్పలు?'' అంటూ జరిగినదంతా చెప్పాడు.

''ఈ పట్నం మనుషులంతా ఇంతే, మామయ్యా! నిజం చెప్పినా నమ్మరు,'' అంటూ కేశవుడు సముదాయించాడు.

ఆ రాత్రి లక్ష్మి తన తండ్రికీ, భర్తకూ వడ్డనచేస్తూ, ''ఆ పనివాణ్ణి వెళ్ళగొట్టక పోయారా?'' అన్నది భర్తతో.

''వాడేం తప్పు చేశాడని? తెలియక జరిగిన పొరబాటు! రేపటి నుంచీ వచ్చి ఏమేం తింటాడో తిననమను. మామయ్య కాకపోతే ఇంకెవరు తినాలి?'' అన్నాడు కేశవుడు.

ఆ మాటకు తిమ్మయ్య తృప్తిపడ్డాడు. కాని, మర్నాడు ఉపాహార భోజన



శాలకు వెళ్ళిన తిమ్మయ్య అల్లుడి ప్రవర్తనకు విస్తుపోయాడు.

"మామయ్యా, నువు కోరినదల్లా తిను! తిన్నాకమాత్రం అణాపైసలతో సహా డబ్బిచ్చి వెళ్ళాలి. లేకపోతే, వ్యాపారం చెయ్యగలమా, మామయ్యా?" అన్నాడు కేశవుడు.

ఆ రాత్రి కేశవుడు ఇంటికి వెళ్ళాక, "ఎటూ మీరు పెట్టరు, నేనే పిండి వంటలు చేసి, మా నాన్నకు పెడతాను," అన్నది లక్ష్మి.

అది విని కేశవుడు, "ఏమిటేమిటీ? పిండివంటలు చేసి పెడతావా? ఛీ! ఛీ! పట్నం వచ్చాక ఇల్లు తెప్పతిరణాలై పోయింది! వచ్చేవాళ్ళూ, పోయేవాళ్ళూ దోచుకు తినేస్తున్నారు. మామయ్య సంగతి వేరే అనుకో. అయినా పిండివంటలు చేసి తినేస్తే ఏమొస్తుంది? అమ్ముకుంటే నాలుగు డబ్బులు వస్తాయి. దండగ ఖర్చులు మామయ్యకు ఇష్టం లేదు సుమా!" అంటూ మండిపడ్డాడు.

భోజనాలు చేసిం తరవాత తిమ్మయ్య, "అల్లుడూ, నీ వరస నా కేమీ నచ్చ లేదురా!" అన్నాడు.

"ఏం చెయ్యమంటావు, మామయ్యా? ఈ పట్నం గాలి అటువంటిది. నీకు తెలియనిదేముందీ? చిన్నప్పుడు నువూ అంతేగదా? అడిగింది లేదనకుండా ఇచ్చి పెంచావు నన్ను. కాని, సంతలో కుళ్ళిపోయిన కాయనైనా తాకనిచ్చేవాడివి కావు. నేను ముందే చెప్పాను, పట్నం వద్దు, పల్లెలోనే ఉంటానని. నువు విన్నావా?" అంటూ నిట్టూర్చాడు కేశవుడు.

తిమ్మయ్య ఆ రాత్రంతా ఆలోచించి, తెల్లవారి గ్రామానికి బయలుదేరుతూ, "కేశవుడూ, మనకు ఈ వ్యాపారాలూ, పట్నవాసాలూ వద్దుగాని, వ్యాపారం ఎవరికైనా అమ్మేసి, మీరు ఇంటికి వచ్చెయ్యండి," అన్నాడు.

ఆ మాటే వరప్రసాదమనుకున్న కేశవుడు వారం తిరగకుండానే పెళ్ళాన్ని వెంటబెట్టుకుని, పల్లెకు చేరుకున్నాడు.



# బిచ్చగాళ్ళు

విజయపురి రాజు జయదేవుడికి తన రాజ్యంలో బిచ్చగాళ్ళు లేకుండా చేయాలనిపించింది. రాజ్యంలోని బీదవారందరూ ఫలానా సమయానికి రాజభవనం ముందు హాజరైతే, వారికి ఇల్లూ, తిండీ, బట్టా అమరే నదుపాయాలు చేయబడతాయని అయన చాటింపు వేశాడు.

అనుకున్న వేళకు వేలకొద్దీ పేదవాళ్ళు రాజభవనం ముందు హాజరయారు. వారి నంఖ్య చూసి రాజుకు తల తిరిగిపోయింది. వారికి జీవనోపాధి కలిగించటానికి ఖజానాలో ఉన్న డబ్బంతా కలిసినా చాలదు. రాజు ఇరకాటంలో పడ్డాడు.

అప్పుడు మంత్రి వచ్చి పేదజనంతో, "ఇళ్ళు కావలిసిన వారంతా కొండ కిందికి వెళ్ళి రాళ్ళు కొట్టండి. వాటితో మీరే ఇళ్ళు కట్టుకుంటారు," అన్నాడు.

వారిలో అధిక నంఖ్యాకులు బిచ్చగాళ్ళేగాని, శ్రమించేవాళ్ళు కారు. అందరూ వెళ్ళి పోయి కొద్దిమంది మంత్రి చెప్పినట్టు చెయ్యటానికి మిగిలారు. రాజు వారికి తాను అనుకున్న ఏర్పాట్లు చేశాడు.

—ఎస్. నంజీవరావు






ఒక మండలాధికారి తన పాలనలో ప్రజలు ఎలా బతుకుతున్నారో చూడటానికి ఒకసారి తణిఖీకి బయలుదేరాడు. మధ్య దారిలోనే చీకటిపడింది. ఆయన చీకటిలోనే కొంత దూరం ప్రయాణం చేశాక, దూరాన మినుకు మినుకుమంటూ దీపాలు కనిపించాయి.

"ఆ దీపాలు కనిపించే వైపు పోదాం," అన్నాడు అధికారి తన పరివారంతో.

''అయ్యో, అవి కొరివిదయ్యాలు! అక్కడ శ్మశానం లాగున్నది,'' అన్నారు అధికారి మనుషులు.

''ఫరవాలేదు, పదండి. శ్మశానం అయితే, దగ్గిరలో ఊరు ఉండనే ఉంటుంది,'' అన్నాడు అధికారి.

ఆ దీపాలు నిజంగా దీపాలే. అది ఊరే. అధికారి ఆజ్ఞాపించగా కొందరు గ్రామస్థులు గ్రామాధికారి భూషయ్యను హాజరుపరిచారు. అతను అధికారికీ, పరివారానికీ బస ఏర్పాటు చేశాడు.

తెల్లవారుతూనే అధికారి గ్రామం తణిఖీ చేశాడు. భూషయ్య వణికిపోయాడు. దాన్ని గ్రామం అనటం కూడా సిగ్గుచేటు. ఎక్కడ చూసినా పెంటకుప్పలూ, మురికి నీటిగుంటలూ, వీధులకు అడ్డంగా పారుతున్న మురుగు కాలవలూనూ.

''గ్రామం ఈ స్థితిలో ఉంటే నువు ఏం చేస్తున్నావు? తగిన చర్యలు ఎందుకు తీసుకోలేదు? పై అధికారులకు ఎందుకు తెలియబరచలేదు?'' అంటూ అధికారి భూషయ్య మీద చిందులు తొక్కాడు.

''నా పైఅధికార్లకు ఎన్ని మహజర్లు పెట్టుకున్నా ఫలితం లేకపోయింది. వారి పై అధికార్లకు చెప్పుకుంటే, లంచాలు అడుగుతున్నారు. పంటలు పాడైపోయి, జనం అల్లాడుతూంటే, లంచాలు ఎలా

ఎమ్. వి. వి. సత్యనారాయణ

పోగుచేయగలను?'' అన్నాడు భూషయ్య, బిక్కచచ్చిపోతూ.

అధికారి ఉలిక్కిపడ్డాడు. ఆయన అప్పటికప్పుడు తన వద్ద ఉన్న డబ్బు నుంచి పదివేల రూపాయలు తీసి భూషయ్యకిచ్చి గ్రామం బాగోగులు చూడమని అతనికీ, అతడికి సహాయంగా ఉన్న పంచాయతీ ఉద్యోగులకూ చెప్పి, ''నేను తిరిగి రెండు నెలలలో ఈ వైపు వస్తాను. గ్రామం అద్దం లాగా ఉండాలి!" అని హెచ్చరించాడు. ఆ రోజే అధికారి సపరివారంగా ముందుకు సాగిపోయాడు.

భూషయ్య ఆ డబ్బుతో గ్రామాన్ని బాగు చేయాలనే అనుకున్నాడు. అయితే మర్నాడే పండుగ వచ్చింది. ఆయన కూతురూ, అల్లుడూ వచ్చారు. వారితోనూ, పిల్లలతోనూ పండుగ నాలుగు రోజులూ సంతోషంగా గడిచిపోయింది. ఆ సంతోషంలో భూషయ్య తనవద్ద ఉన్న డబ్బులో వెయ్యి రూపాయలు పెట్టి కూతురికి బంగారు గొలుసు చేయించి, అందరికీ కొత్త బట్టలు కొన్నాడు.

భూషయ్య భార్య బంగారు వడ్డాణం కావాలని పట్టుబట్టింది. భూషయ్య పెట్టిన ఖర్చుకే బాధపడుతూ, భార్యను బతిమాలాడు; ప్రజల డబ్బు తన యిష్టం వచ్చినట్టు ఖర్చుచేసే హక్కు తనకు



లేదన్నాడు. ఆమె భర్త మాట విని పించుకోక, బంగారు పనివాడి దగ్గర అరువుకు వడ్డాణం చేయించుకున్నది. చేసేదిలేక భూషయ్య ప్రజల సొమ్ముతోనే ఆ బాకీ తీర్చాడు.

పంచాయతీ ఉద్యోగులకు ఈ సంగతి తెలిసి, మరో వెయ్యి రూపాయల వరకూ అప్పులు అడిగారు. భూషయ్య వారు కోరినట్టు డబ్బు ఇచ్చి పంపేశాడు.

తరవాత పంచాయతీ ఉద్యోగులు ఎంత తక్కువలో ఊరి మరమ్మతు జరుగుతుందోనని లెక్కలు వేశారు. ఎంత హీనంగా చూసినా పదివేలు కావాలి. భూషయ్య దగ్గిర మిగిలినది అయిదు వేలే!

ఇది చాలనట్టు భూషయ్య భార్య ఒక కొత్త పనివాణ్ణి జీతానికి పెట్టుకున్నది. ఈ కొత్త నౌకరు ఒకనాడు భూషయ్యగారి మంచం కింద పడి ఉన్న డబ్బు సంచీ చూసి, దాన్ని తీసుకుని పారిపోయాడు. ఈ వార్త క్షణాలమీద మండలమంతా పాకింది. భూషయ్య ఇంటి నౌకరు పదివేల రూపాయలు దొంగిలించి, పారిపోయాడని అందరూ చెప్పుకున్నారు.

మండలాధికారి మర్నాడే భూషయ్యను తన వద్దకు పిలిపించుకుని, "మిగిలిన అయిదువేల రూపాయలూ ఏవి?" అని అడిగాడు.

తన నౌకరు మొత్తం పదివేలూ ఎత్తుకుపోయాడని భూషయ్య చెప్పాడు. అతను ఇలా అంటూండగానే అధికారి ఇంటి లోపలినుంచి భూషయ్య నౌకరు వచ్చాడు.

"ఏమిరా, దొంగ వెధవా? పదివేల రూపాయలతో పారిపోతావా?" అన్నాడు భూషయ్య గుడ్లు ఉరిమి.

అధికారి హేళనగా నవ్వి, "భూషయ్యా, నువే ఆ సొమ్ము వాడి కంటపడేలాగ చేశావు. దొంగతనం మొత్తంగా వాడికే అంటగట్టాలని నీ ఉద్దేశం. కాని, వాడు నా కొడుకేననీ, నువు డబ్బు సరిగా ఖర్చు పెడతావో, లేదో చూడమని నీ మీద నిఘా వేశాననీ నువు ఊహించి ఉండవు. నీ పథకం ప్రకారం దొంగతనమైతే జరిగింది గాని, నీ వ్యవహారం బయట పడింది. ఎలా సంపాదిస్తావో, మిగిలిన డబ్బు సంపాదించు. గ్రామం బాగుచేసే పని నా కొడుకు చూస్తాడు," అన్నాడు.

భూషయ్యకు తల తీసేసినట్టయింది. అతను తన ఇల్లు తాకట్టు పెట్టి, డబ్బు తెచ్చి ఇచ్చాడు.

త్వరలోనే గ్రామం బాగుపడింది.

మండలాధికారి తన పరివారంతో, "మీరు ఆనాడు అన్నారే కొరివిదయ్యాలని, ప్రజల సొమ్ము సొంతంలాగా వాడుకునే వాళ్ళే నిజమైన కొరివి దయ్యాలు!" అన్నాడు.





# రాజు చేసిన తప్పు

రాజసేనుడనే రాజుకు ఒక కుమార్తె ఉండేది. ఆమె నలుపురంగు కలిగి, అందవికారంగా ఉండేది. అందుచేత చాలాకాలం ఆమెకు వివాహం కుదర లేదు. రానురాను తన కూతురి పెళ్ళి గురించి రాజుకు బెంగ ఎక్కువయింది.

చిట్టచివరకు రాజు, ఒకనాడు, తన మంత్రి అయిన రాహులుణ్ణి పిలిచి, "ఒక్క వారంలోగా నా కుమార్తెకు సంబంధం నిశ్చయం కావాలి. ఈ పని నువే చెయాలి. ఒక వారంలోగా గుణవంతుడయిన ఒక యువకుణ్ణి నాకు అల్లుడుగా కుదర్చకపోయావో నిండు సభలో నీ తల తీసేయిస్తాను, ఇక వెళ్ళు," అన్నాడు.

మంత్రి రాహులుడు అహోరాత్రాలు రాజుగారి అల్లుడి కోసం అన్వేషించాడు, కాని లాభం లేకపోయింది. రాజు కూతురు పరమ అనాకారి అని అందరికీ తెలుసు. అందుచేత ఎవరూ ఆమెను పెళ్ళాడటానికి ఒప్పుకోలేదు. మంత్రి తనకున్న కొద్ది వ్యవధిలో, ఎన్నో శ్రమల కోర్చి, పొరుగు రాజ్యాలు కూడా తిరిగి చూశాడు. కాని ఏమీ ప్రయోజనం లేకపోయింది.

ఆరు రోజులు గడిచాయి. తన భర్త ముఖాన విచారరేఖలు చూసి రాహులుడి భార్య కారణం అడిగింది. కాని రాహులుడు ఒకంతట చెప్పలేదు. చిట్టచివరకు అతను, రాజు తనకు అప్పజెప్పిన పని గురించీ, అది నెరవేర్చటానికి తాను అసమర్థుడు కావటం గురించీ, మర్నాడు నిండు సభలో తన తల తెగనుండటం గురించీ భార్యకు చెప్పాడు.

రాహులుడి భార్య, "మీరేమీ భయపడకండి. దీని కేదైనా ఉపాయం ఆలో

ఎస్. అగ్వల్

చించుదాం,'' అన్నది. ఆ మాటలతో ధైర్యంవచ్చి రాహులుడు ఆ రాత్రి నిశ్చింతగా భోజనంచేసి కూర్చున్నాడు. అయితే రాహులుడికి అతని భార్య ఏ ఉపాయమూ చెప్పనేలేదు.

మర్నాడు రాజభటులు వచ్చి, రాజు తీసుకురమ్మన్నట్టు చెప్పి, రాహులుణ్ణి రాజసభకు తీసుకుపోయారు. రాజు నిండు సభలో మంత్రిని, ''రాజకుమార్తెకు సంబంధం చూశావా?'' అని అడిగాడు.

''లేదు,'' అన్నాడు మంత్రి.

ఆ జవాబుతో కోపోద్రిక్తుడైన రాజు, మంత్రి తల నరకటానికి ఏర్పాట్లు చేయమని తన భటులకు ఉత్తరువు ఇచ్చాడు.

ఇంతలో సభలోకి రాహులుడి భార్య చింకిబట్టలు ధరించి, ఒక పసికందును చేతులలో పెట్టుకుని వచ్చింది. ఆమె తన మంత్రి రాహులుడి భార్య అని రాజుకు తెలియదు.

రాజు ఆశ్చర్యపడుతూ ఆమెను, ''ఏమమ్మా? నీకు ఏం కావాలి?'' అని అడిగాడు.

''మహారాజా, నన్ను రక్షించండి. నా బిడ్డ అస్తమానమూ ఏడుస్తుందని నా భర్త నన్ను కొట్టుతున్నాడు. చంపేస్తానంటున్నాడు!'' అన్నది మంత్రి భార్య.

''బిడ్డకు ఏదైనా రోగమున్నదేమో! దాని ఏడుపుకు నువు ఎలా బాధ్యురాలివి? ఆ మూర్ఖుణ్ణి శిక్షిస్తాను,'' అన్నాడు రాజు ఉద్రేకంగా.

వెంటనే మంత్రి భార్య, ''మహారాజా, మీ కుమార్తెకు వివాహం కుదరకపోవటానికి ఆమెలో ఏం లోపం ఉన్నదో? అందుకు మంత్రిని ఎందుకు శిక్షిస్తున్నారు? నేను తమ మంత్రిగారి భార్యను. దయచేసి నా భర్తను వదిలెయ్యండి,'' అన్నది.

ఈ మాటకు సభలో అందరూ హర్షధ్వానాలు చేశారు. రాజు తన పొరపాటు గ్రహించాడు.



# నరకం - స్వర్గం

సోమయ్య అనే ధనికుడు జన్మలో ఎన్నడూ ఏ విధమైన దానమూ, ధర్మమూ చేసి ఎరగడు. చివరకు తనకోసం యమదూత వచ్చినప్పుడు అతనికి ఒక ఆలోచన తోచింది. అతను యమదూతతో, "నా ఆస్తిలో నగం నా కొడుకులకు ఉంచి, మిగతాది దానధర్మాలకు రాద్దామనుకుంటున్నాను. కొద్ది నిమిషాలు ఆగు," అన్నాడు.

"నాకా అధికారం లేదు. యమధర్మరాజును అడుగు," అన్నాడు యమదూత. సోమయ్య తన కొడుకులతో, తాను మళ్ళీ బతికి వచ్చి వీలునామా రాస్తాననీ, తనకు దహనం జరపవద్దనీ అన్నాడు. తరవాత అతను చచ్చి, యమధర్మరాజు వద్దకు వెళ్ళి, కొద్ది నిమిషాలు గడువు అడిగాడు. యముడు సరేనన్నాడు.

ఈ లోపల సోమయ్య కొడుకులు, తండ్రి బతికి వస్తే నగం ఆస్తి పోతుందని, అతి తొందరగా దహనం ఏర్పాటు చేశారు. చితి మీద బతికి లేచిన సోమయ్య, కొడుకుల మీద మండిపడి, తన ఆస్తి అంతా దానధర్మాలకు రాసి, చచ్చి స్వర్గానికి వెళ్ళాడు.

—కోలార్ కృష్ణఅయ్యర్





# వెంకాయమ్మ మొగుడు

వెంకాయమ్మ మొగుడు బంగారయ్య చాలా బద్ధకస్తుడు. పెళ్లి అయాక అతను సొంత ఊరు విడిచి వెంకాయమ్మ దగ్గిరికి వచ్చేశాడు. అది మొదలు వెంకాయమ్మే అతన్ని పోషిస్తున్నది. బంగారయ్య కడుపులో చల్ల కదలకుండా హాయిగా ఇంట్లోనే పడుకునేవాడు.

వెంకాయమ్మ చెయ్యని పని అంటూ లేదు—పాలు పితికి, అమ్ముతుంది; పిడకలు చేస్తుంది; నాలుగు ఇళ్ళలో వంట చేస్తుంది; ఎవరి ఇంట ఏ అక్కర కలిగినా నడుము కట్టుకుని పనిచేస్తుంది.

ఒకరోజు మధ్యాన్నం బంగారయ్య నిద్రమత్తులో ఉండగా ఎవరో పొరుగింటి ఆడమనిషిని "బంగారయ్య ఇల్లెక్కడ?" అని అడగటమూ, పొరుగింటి ఆమె, "ఈ ఊళ్లో బంగారయ్య అంటూ ఎవరూ లేరు," అనటమూ వినిపించింది.

బంగారయ్య లేచి వెళ్ళి తలుపు తెరిచి చూసేసరికి, బంగారయ్య ఊరివాడు కనిపించి, "అడుగో బంగారయ్య! లేడంటావేమిటమ్మా?" అని పొరుగింటి ఆమెతో అన్నాడు.

"నువ్వు అడిగినది వెంకాయమ్మ మొగుడా?" అని ఆమె లోపలికి వెళ్లింది.

వచ్చిన మనిషి బంగారయ్యతో కాస్సేపు మాట్లాడి, "నువ్వు ఈ ఊళ్లో వెంకాయమ్మ మొగుడుగా చలామణీ అవుతూ మన ఊరి పరువు తీస్తున్నావా?" అని వేళాకోళం చేసి వెళ్లిపోయాడు.

బంగారయ్యకు చాలా అవమానమయింది. తను బంగారయ్యగా పేరు బడడం ఎలాగా అని ఆలోచించాడు. ఇంట్లో కూర్చున్నంత కాలమూ అది సాధ్యపడదు; లేచి వెళ్ళి ఏదైనా పని చేయాలి! డబ్బు గడించాలి!

మాచిరాజు కామేశ్వరరావు

మర్నాడు బంగారయ్య వెంకాయమ్మ కన్న ముందే లేచి, గేదెల పాలు పితికి, అమ్మకానికి తీసుకువెళ్లాడు.

అతను ఒక వాడుక ఇల్లు తలుపు తట్టితే ఇంటి ఇల్లాలు వచ్చి, "మాకు వెంకాయమ్మ పాలు పోస్తుంది," అన్నది.

ఆమె భర్త బంగారయ్యను పరికించి చూసి, "ఇతను వెంకాయమ్మ మొగుడులే, పాలు పోయించుకో," అన్నాడు.

అతను, "మీకు చస్తే పాలుపొయ్యను!" అని వెనక్కు తిరిగి వచ్చేశాడు. వెంకాయమ్మ మొగుడుగా పాలు అమ్మి డబ్బు సంపాదించటం అతనికి ఇష్టం లేదు.



అతను రోజంతా ఆలోచించి, పెదరెడ్డి దగ్గిరికి వెళ్ళి పని అడగాలని నిశ్చయించుకున్నాడు. ఆ మధ్య పెదరెడ్డి కొడుకు పెళ్ళి అయినప్పుడు రెండు రోజుల పాటూ వెంకాయమ్మే వారింట నిర్వాహకం చేసింది. ఆ రెండు రోజులూ బంగారయ్య భోజనం వేళకు పెదరెడ్డి ఇంటికి వెళ్లాడు. ఆ ఇంట్లో అందరూ అతణ్ణి ఎరుగుదురు.

బంగారయ్య రాగానే రెడ్డి కూతురు, "నాన్నా, వెంకాయమ్మ మొగుడు వచ్చాడు," అని కేక వేసి తండ్రికి చెప్పింది.

కూతురు కేకవిని రెడ్డి బయటికి వచ్చే లోపునే బంగారయ్య అక్కడినుంచి వెళ్లిపోయాడు. వెంకాయమ్మ మొగుడు అనిపించుకోకూడదని బంగారయ్య మరింత గట్టిగా తీర్మానించుకున్నాడు. ఆఖరుకు వడ్డీ వ్యాపారి దగ్గిర కొంత డబ్బు అప్పుచేసి, సొంత వ్యాపారం చేద్దామనుకున్నాడు అతను.

"నువ్వెవరో నాకేం తెలుసు? తాకట్టు ఏమీ లేకుండా నీకు అప్పు ఎలా ఇస్తాను?" అన్నాడు వడ్డీవ్యాపారి.

అతనివద్ద పనిచేసే కుర్రాడు, "ఈయన మనకు పాలుపోసే వెంకాయమ్మ మొగుడు లెండి. బాకీ చెల్లించకపోతే పాల ఖాతాలో జమ కట్టుకోవచ్చు," అని శిఫార్సు చేశాడు.

వడ్డీ వ్యాపారి డబ్బు అప్పియ్యటానికి సిద్ధపడ్డాడు గాని, బంగారయ్య తనకు అవసరం లేదని విసురుగా వచ్చేశాడు.

అతనికి బతుకు మీద రోత పుట్టింది. అతను మరో బైరాగి వాడి సహకారంతో సన్యాసుల్లో కలిసిపోయాడు. ఆరుమాసాల అనంతరం బంగారయ్య ఆ ఊరికి తిరిగి వచ్చాడు.

''ఎండనపడి వచ్చాడు, ఆ సన్యాసికి కాస్త మజ్జిగ ఇయ్యి,'' అన్నాడు ఒక గృహస్థు తన భార్యతో.

"సన్యాసికి బియ్యం వెయ్యి, అమ్మా," అంటూ ఒక పిల్ల తల్లిని కేకవేసింది.

''సన్యాసికి ఈ డబ్బులు ఇయ్యరా,'' అని ఒక వ్యాపారి పనివాడితో అన్నాడు.

తనను అందరూ బంగారయ్య అని పిలవకపోతే మానె, వెంకాయమ్మ మొగుడు అనటం లేదు, అంతే చాలుననుకున్నాడు బంగారయ్య. అలా అనుకుంటూ అతను చెరువు గట్టు మీదికి వచ్చేసరికి వెంకాయమ్మ ఎదురుపడి, ''నువు ఎన్ని వేషాలు వేసినా నా కళ్ళు కప్పలేవు. నీకు వేళకు అన్నీ అమర్చి పెట్టుతూంటిని గదా, ఎందుకు పుచ్చుకున్నావీ సన్యాసం?'' అని అడిగింది.

వెంకాయమ్మ మొగుడని పిలిపించుకోవటం ఇష్టంలేక తాను ఈ పనిచేసినట్టు బంగారయ్య ఒప్పుకున్నాడు.

''నిన్ను ఉత్త పుణ్యానికి వెంకాయమ్మ మొగుడని అందరూ ఎందుకంటారూ? పెళ్లాం బిడ్డల్ని పోషించటం మగవాడి విధి. నువు నా మీద పడి తింటూ ఇంటి పట్టున ఉండిపోయావు. ఇకమీదట నువు కష్టపడి సంపాదించి, నన్ను పోషించు. బంగారయ్య పెళ్లాంగా చలామణీ కావటానికి నాకు అభ్యంతరంలేదు. మీ ఊళ్లో నువు బంగారయ్యవేగా? పద, అక్కడికి పోదాం,'' అన్నది వెంకాయమ్మ.

బంగారయ్య కళ్లు తెరుపుడు పడ్డాయి. అతను సన్యాసి దుస్తులు విడిచేసి, మామూలు బట్టలు కట్టుకుని, భార్యను తీసుకుని తన ఊరికి వెళ్ళిపోయాడు.





# వైణికుడు జయధర్

గుణధరుడు గొప్ప వీణా విద్వాంసుడు. ఆ మండలంలో అతనికి సాటిరాగల వైణికు డుండేవాడు కాడు. జమీందారు తన ఇంట ఏదన్నా అక్కరపడినప్పుడల్లా గుణధరుడి చేత విధిగా వీణ కచేరీ చేయించేవాడు. ఇతర సమయాల్లో కూడా ఆయన తన బంధుమిత్రుల వినోదం కోసం గుణధరుడి చేత వీణ వాయింప జేసి, ఆనందించేవాడు.

గుణధరుడి యౌవనమంతా దేశసంచారంలో గడిచిపోవటంచేత, అతను పెళ్లాడి, స్థిరపడటానికి కొంతకాలం పట్టింది. తరవాత అతనికి జయధరు డనే కొడుకు పుట్టాడు.

జయధరుడి మూడో ఏట అతని తల్లి హఠాత్తుగా చనిపోయింది. ఆ తరవాత అతన్ని సాకటానికి అతని పెత్తల్లి సహాయపడింది. ఆమె వితంతువు.

జయధరుడికి తండ్రే సంగీత శిక్షణ ఇచ్చాడు. అయితే గుణధరుడు అస్తమానమూ సంగీత సభలకూ, సమ్మేళనాలకూ పోతూ ఉండటం చేత, జయధరుడి బాధ్యత ఎక్కువగా అతని పెత్తల్లే వహించేది. వారి కుటుంబం ఆర్థికంగా అంత ఉన్నత స్థితిలో కూడా లేదు. ఎందుకంటే గుణధరుడు తన సంపాదనలో నుంచి కొంత వెనక వేసుకునే ఆలోచన చెయ్యక, చేతిలో ఉన్నదంతా తన మిత్రులైన కళాకారుల కోసం ఖర్చు చేసేవాడు.

జయధరుడు ఇరవై ఏళ్ళు నిండేసరికి మంచి ప్రతిభగల వైణికుడుగా తయారయాడు. అతని వాద్యం విని మెచ్చుకోని వారు లేరు. కాని అతని తండ్రి గుణధరుడు మాత్రం, "ఎంతమంది నిన్ను మెచ్చుకోనీ గాక, నీ వాద్యం ఇంకా



పరిపక్వం కాలేదు. నీ గాన కళ ఆధారంగా నువు జీవనోపాధి కలిగించుకునే స్థితి ఇంకా ఏర్పడలేదు. కావాలంటే నువు కచేరీలు చెయ్యి. కాని నీ సంగీతాన్ని డబ్బుకు అమ్ముకోకు: సంగీతం వృత్తిగా పెట్టుకోకు. ఆ పని ఎప్పుడు చెయ్యవచ్చునో నేను చెబుతాను," అన్నాడు.

జయధరుడికి తండ్రి మాటమీద ఎంతో గురి. అందుచేత తండ్రి చెప్పినప్పుడే వైణికవృత్తి చేబట్టుతానని అతను తండ్రి కాళ్ళు తాకి ప్రమాణం చేశాడు.

కాలం గడిచింది. జయధరుడు వీణ కచేరీలు చెయ్యటానికి సంచారం వెళ్ళి ఉన్న సమయంలో గుణధరుడు కన్నుమూశాడు. జయధరుడు తిరిగివచ్చి, తండ్రి ఆఖరి ఘడియలలో తాను దగ్గిర లేకపోయినందుకు చాలా బాధపడ్డాడు. తరవాత అతను తన తండ్రి చిత్తరువును ఎత్తు పీట మీద గోడకు ఆనించి పెట్టి, దాన్ని పూలతో పూజ చేస్తూ, ఎదురుగా కూర్చుని వీణా వాదన సాధన చేసుకుంటూ వచ్చాడు.

అతని వాయింపు విన్నవాళ్లు ... ను తండ్రిని మించాడన్నారు. పాట కచేరీల ద్వారా అతని ఖ్యాతి నానాటికీ వృద్ధి అవుతున్నకొద్దీ, ఆర్థికంగా అతని పరిస్థితి హీనం కాసాగింది. ఒక్కొక్కసారి అతను పస్తులుండటం కూడా జరిగింది.

"పాట కచేరీలు చేసేవాడివి ప్రతిఫలం ఎందుకు తీసుకోవు?" అని జమీందారు అతన్ని అడిగాడు.

"మా నాన్నగారి అనుమతి లేదు. ఆయన నన్ను సంగీతం వృత్తిగా పెట్టుకోవద్దన్నారు. అంతగా అయితే శరీరశ్రమ చేసి పొట్ట పోసుకుంటాను," అన్నాడు జయధరుడు.

అతను తండ్రి దగ్గిర చేసిన ప్రమాణం అందరూ ఎరిగినదే. ఇప్పుడు తండ్రి బతికి ఉంటే తప్పక అతన్ని వైణిక వృత్తి చేపట్టమని ఉండేవాడే. ఎలాగైనా అతనికి వీణ ద్వారా జీవనోపాధి కలిగిం

చాలని అతని మిత్రులూ, అభిమానులూ గట్టిపట్టుపట్టారు.

జమీందారు తన మిత్రులందరితోనూ సంప్రతించాడు. వారిలో ఇంద్రజాలికుడు సోమనాధుడు కూడా ఉన్నాడు. "మనం జయధరుడి తండ్రిని ప్రార్థించి, జయధరుడు వైణిక వృత్తి అవలంబించటానికి అనుమతి సంపాదిస్తే పని జరగదా?" అన్నాడు సోమనాధుడు.

"చచ్చిపోయినవాడి అనుమతి ఎలా సంపాదించటం?" అన్నారు మిగిలిన వాళ్లు ఆశ్చర్యంగా.

"అదంతా నాకు వదిలెయ్యండి. మీరు నాకు అండగా ఉండండి, చాలు!" అన్నాడు సోమనాధుడు.

జమీందారు జయధరుడితో, "ఊళ్ళో ఒక గణాచారి ఉన్నాడు. పూనకం వచ్చినప్పుడు చచ్చినవాళ్ళతో మాట్లాడతాడు. అతని ద్వారా నీ తండ్రి నుంచి, నువు వైణికవృత్తి చేబట్టటానికి అనుమతి సంపాదిస్తాం. ఏమంటావు?" అన్నాడు.

జయధరుడు కొంచెం పస్తాయించి, తన పెత్తల్లిని సంప్రతించినమీదట జమీందారుతో, "అలాగే చెయ్యండి," అన్నాడు.

అదృష్టవశాన గుణధరుడి తద్దినం దగ్గరలోనే ఉన్నది. ఆ రోజు ఒక దీర్ఘ



కాయుణ్ణి తీసుకువచ్చారు. అతను గుణధరుడి చిత్తరువుకు ఎదురుగా కూచుని కొంతసేపు ధ్యానంలో ఉండి, పూనకం వచ్చినవాడిలాగా కనిపించాడు. అతను మారిన గొంతుతో, "చిన్న తెల్ల కాగితం ముక్క తీసుకుని, దాన్ని కాగితపు సంచీలో పెట్టి అంటించి, చిత్తరువు ముందు ఉంచండి. కొంతసేపైన తరవాత కాగితం సంచీ చించి, కాగితం ముక్క తీసి చూడండి," అన్నాడు.

జమీందారుగారి ఇంటి నుంచి కాగితపు సంచీ, కాగితం ముక్కా వగైరా వచ్చాయి. కాగితం ముక్క కాగితపు సంచీకన్న

చిన్నదిగా ఉండి, అందులో పట్టింది. దాన్ని సంచీలో పెట్టి, అతికించి, చిత్తరువు ముందు ఉంచారు. కొంచెం సేపు అయాక సంచీ చించి, కాగితం ముక్క పైకి తీసి చూస్తే దాని మీద గుణధరుడి దస్తూరితో ఇలా రాసి ఉన్నది.

"వైణికవృత్తి అవలంబించటానికి అనుమతిస్తున్నాను—నాన్న."

జయధరుడు ఆ కాగితం తీసుకుని కళ్ళకు అద్దుకుని, తండ్రి చిత్తరువు ముందు ప్రణమిల్లి, "నాన్నా, నీ అనుమతి అయింది గనక, వైణికవృత్తిలో ప్రవేశిస్తాను. నీ ఖ్యాతికి కళంకం రాకుండా చూడటానికి ప్రయత్నిస్తాను," అన్నాడు.

అటు తరవాత జయధరుడి పైన కనక వర్షం కురిసింది.

ఇదంతా సోమనాధుడి ఇంద్రజాలం మహిమ. అతను ఒకే ప్రమాణం గల రెండు తెల్ల కాగితం ముక్కలు తీసుకుని, ఒకదాని మీద గుణధరుడి దస్తూరీని అనుకరిస్తూ సందేశం రాశాడు; అలా రాసిన కాగితం ముక్కను ఒక మామూలు కాగితపు సంచిలో పెట్టి, దానిని సంచీ మూతవేపు ఉంచాడు. తరవాత అతను అలాటిదే మరొక కాగితపు సంచీ తీసుకుని, దాని రెండు పక్కలూ, దిగువ భాగమూ తీసేసి, చిరునామా రాసేపక్క మూతతట్టు ఉండేటట్టుగా మొదటి సంచీలో పెట్టాడు. ఇలా చెయ్యటం వల్ల కాగితపు సంచీలో ఒక రహస్యపు అర ఏర్పడింది. తెల్లకాగితం ముక్కను, అందరూ పరీక్షించి సంచీలో పెట్టేటప్పుడు సంచీ ఖాళీగా ఉన్నట్టే కనబడింది. సంచీని అంటించేటప్పుడు సోమనాధుడు రెండు మూతలనూ కలిపి అంటించేశాడు. తరవాత సంచీని చింపి కాగితం ముక్కను పైకి తీసేటప్పుడు తెల్లకాగితం రహస్యపు అరలో ఉండిపోయి, సందేశం గల కాగితం ముక్క పైకి తీయబడింది. జమీందారు ఆ సంచీని అప్పటికప్పుడే తీసేసుకుని తన జేబులో పెట్టుకున్నాడు.





# వీర హనుమాన్

పాండవులు జూదంలో కౌరవులకు ఓడి వనవాసం చేస్తున్నారు. ద్రౌపది భీముడితో వనవిహారం చేస్తూ, ఆహ్లాదకరంగా ఉన్న ఒక ప్రదేశంలో చదునుగా వేదికలాగ ఉన్న స్ఫటికశిలపై కూర్చొని, దూరంగా కనిపిస్తున్న హిమగిరిశిఖరాల సొగసులు తిలకిస్తూన్నది. ఆ సమయంలో పెద్ద గాలి వీచింది. ఆ గాలిలో అపూర్వమైన పెద్ద పువ్వు కొట్టుకొనివచ్చి ద్రౌపది ఒడిలో పడింది. ఆ ప్రదేశమంతా దాని పరిమళంతో గుబాళించిపోయింది. దాని రేకులు లెక్కకుమిక్కిలిగా ఉన్నవి. అది కొంచెం నలిగి ఉన్నది.

అది సౌగంధికా కమలం. కుబేరుడి పట్టణమైన అలకాపురి దాపున మాన సరోవరంతో కలిసి ఉన్న దళసరోవరంలో రోజుకు ఒకటి మాత్రమే వికసిస్తూంటుంది. కుబేరుడు ప్రతి రోజూ పుష్పక విమానం మీద కైలాసానికి వెళ్లి సౌగంధికా పుష్పంతో శివార్చన చేసి, క్రితం రోజు అర్చించిన పువ్వును శివనిర్మాల్యంగా తన నగరానికి తీసుకెళ్తూంటాడు. అలాంటిదే పుష్పకం నుండి జారి, ఆకాశం నుంచి గాలితో కొట్టుకొనివచ్చి, ద్రౌపదికి దొరికింది.

ద్రౌపది అచ్చెరువుతో ఆ పుష్పాన్ని చూసి ముచ్చటపడుతూ, అలాంటి పుష్పాన్ని కొత్తది తెచ్చిపెట్టమని భీముడిని ఆప్యాయంగా కోరింది. భీముడు గదను భుజాన వేసుకొని వెతుకుతూ వెళ్ళివెళ్ళి,



హిమాలయ సానువులో ఉన్న కదళీవనం ప్రవేశించి నడుస్తున్నాడు. ఆ వనంలోనే హనుమంతుడు పెద్ద అరటిచెట్టు బోదెను పండు ముసలిరూపంతో ఆనుకొని కాళ్ళు చాచి కూర్చొని, రామస్మరణ చేస్తున్నాడు. అతని తోక చాలా దూరం వరకూ దారి కడ్డంగా పడి ఉన్నది. భీముడు దాన్ని ఒక కోతి తోకగా గుర్తించి, దాటుకొని వెళ్ళడానికి రాజసం అడ్డుపచ్చి, చుట్టూరా కలయజూచాడు. రామరామ అనుకుంటూ కునుకుపాట్లుపడుతూన్న హనుమంతుడు అతడికి కనిపించాడు. వెంటనే భీముడు నేల అదిరేలా అడుగుల చప్పుడు చేస్తూ బెదిరించాడు.

హనుమంతుడు ఆయాసంగా వగరుస్తూ, "నాయనా! పండు ముదుసలిని, ఓపికలేదు, నువ్వే దాన్ని పక్కకు నెట్టుకొని వెళ్ళు, కనికరించి కాస్త శ్రమపడు!" అన్నాడు.

భీముడు గదనువాల్చి తోకను తోశాడు. అది కొంచెమైనా జరగలేదు. చేత్తో తోశాడు, రెండు చేతులతో సత్తువపూరా గట్టిగా నొక్కపట్టి కదిలించాలని విశ్వ ప్రయత్నం చేసినా, ఏ మాత్రం లాభం లేకపోయింది.

హనుమంతుడు విసుక్కుంటూ, "ఏమిటి నాయనా, గుప్పెట పట్టి, నొక్కి, నొక్కి చంపుతున్నావు? ఒక ముసలి కోతి గాడి తోకను నెట్టలేకపోతున్నావే, ఏం ఘన కార్యం సాధిద్దామని పెద్ద గద పట్టుకొని మరీ బయలుదేరావు? మీ కుర్రాళ్ళకి తొందరపాటేగాని ఆలోచన ఉండదు, అందులోనూ ప్రియమైన ఆడదాని కోరిక తీర్చడానికి మరీ తొందర, ఎక్కడలేని చురుకూ వస్తుంది; అటువంటిదేమీ కాదు గద?" అన్నాడు.

భీముడు ఉడికిపోయి, "అధిక ప్రసంగం కట్టిపెట్టు!" అంటూ హనుమంతుడిని గదతో కొట్టబోయాడు.

హనుమంతుడు నవ్వుతూ, "ఓహో! గదాయుద్ధానికి పిలుస్తున్నావా? ఇన్నాళ్లు

సాము నేర్చి మూలనున్న ముసలివాడి తోనా యుద్ధానికి దిగావు? నీలాంటి తమ్ముళ్ళుంటే అన్నలకు అరణ్యవాసాలే గతి! నాకూ ఉందిలే ఒక గద; నాతో బాటే అదీ ముసలిదైపోయింది!'' అని చెప్తూ దూరంగా ఉన్న తన గదను చేయి చాచి అందుకోబోతే అందక, ''కాస్త నా గదను అందియ్యి తమ్ముడూ, గదా యుద్ధం చేయమంటున్నావుగా మరి!'' అన్నాడు.

భీముడు ఆ గదను ఎత్తి అందియ్యడానికి ఆయాసపడుతూంటే హనుమంతుడు, ''మా కాలంలో ఇలాటి గదలే గాని, గుల్లగదలూ, రేకుగదలూ ఎరగం. ఇంకా వెనకటి కాలంలో బండరాతి గదలే వాడేవాళ్ళం!'' అంటూ గదను అందుకుని బెండులాగ ఎత్తి, భీముడి నెత్తిమీద ఆశీర్వదిస్తున్నట్టుగా సుతారంగా మోపాడు. భీముడు బాధతో మూలుగుతూ తన గదతో హనుమంతుణ్ణి కొట్టాడు. హనుమంతుడు దిగ్గున లేచి గదను ఎత్తి పట్టుకొని హుంకరించాడు. కదళీవనం దద్దరిల్లింది.

ఇద్దరూ చాలాసేపు గదా యుద్ధం చేశారు. భీముడి గద పట్టుతప్పి దూరానికి తూలిపడింది. హనుమంతుడూ తన గదను విసిరేసి మల్లయుద్ధానికి తొడ చరిచాడు.



ఇద్దరూ మల్లయుద్ధం చేస్తూండగా భీముడికి ఒక విషయం బోధపడింది. హనుమంతుడు తలచుకొంటే భీముణ్ణి చిత్తు చేసి ఏం చేసినా చేయగలడు. కాని హనుమంతుడు గదాయుద్ధంలోనూ, మల్లయుద్ధంలోనూ తనకు తెలియని మెళుకువలన్నీ గురువు శిష్యుడికి నేర్పుతున్నట్టుగా యుద్ధంచేసి చూపించాడు. భీముడు చప్పున హనుమంతుడి ముందు మోకరిల్లి, ''మహానుభావా, తెలుసుకున్నాను! నువ్వు హనుమంతుడివే! నేను వాయుదేవుడి వరప్రసాదుణ్ణి, కుంతి కుమారుడిని, భీమసేనుడిని, ధర్మరాజు పెద్దతమ్ముణ్ణి! అనుగ్రహించు!'' అని స్తోత్రం చేశాడు.



హనుమంతుడు భీముణ్ణి వాత్సల్యంతో లేవనెత్తి, "ఔను, తమ్ముడూ! మనం ఇద్దరమూ వాయునందనులమే!" అన్నాడు.

భీముడు, "నీ బ్రహ్మాండమైన రూపాన్ని చూడాలని ఉంది!" అన్నాడు.

"నాయనా! ఇది ద్వాపర యుగం; నా పూర్తి విశ్వరూపం నీవు చూడలేవు. నీ తృప్తి మేరకు చూపిస్తాను, చూడు!" అని శరీరాన్ని మేఘమండలాన్ని దాటిస్తూ పెంచి, తోకను ఎత్తి ఆకాశాన్ని చుట్టుతూ హనుమంతుడు భీకరంగా గర్జించాడు. భీముడు అదిరిపడుతూ ఆ రూపాన్ని చూడలేకపోయాడు. విశ్వరూపాన్ని ఉపసంహరించుకోమన్నాడు.

హనుమంతుడు తగ్గి, "ఇంతకూ నీవు బయలుదేరిన పని చెప్పావే కాదు!" అన్నాడు. భీముడు చెప్పాడు.

"భీమసేనా! దళసరోవరాన్ని కేశికి అనే యక్షిణి కాపలా కాస్తూంటుంది. అది చాలా ప్రచండురాలు. దాని ముందర బల పరాక్రమాలు ఎందుకూ పనికి రావు. దాని మాయాజాలానికి లొంగని వారుండరు. నేను జపించే రామనామం నిన్ను హెచ్చరిస్తుంది, అప్పుడు జాగ్రత్త పడు. గుర్తుంచుకో, ఆ యక్షిణి గొప్ప శివదీక్షాపరురాలు. నా రోమాల్ని గుప్పెడు పట్టుకెళ్లు. యక్షిణి నిన్ను అడ్డగించినప్పుడల్లా, ఒక రోమాన్ని దాని ముందు వెయ్యి. రోమం పడ్డ చోట శివలింగం లేస్తుంది. యక్షిణి సహస్రనామాలతో దాన్ని అర్చిస్తూ కూర్చుంటుంది. ఆవిధంగా నీ పని చక్కబెట్టుకొని రా!" అని చెప్పి హనుమంతుడు తన తోక కుచ్చునుండి రోమాల్ని తీసి ఇచ్చి, భీముడికి దళసరోవరానికి దారి చూపించాడు.

కేశికి దూరంలో వస్తూన్న భీముణ్ణి చూసి, వెంటనే ఎంతటివారినైనా సమ్మోహపరచగల అద్భుత సౌందర్యవతిగా రూపుదాల్చి, ఆటపాటలు మొదలు పెట్టింది. భీముడు సమీపించి పరవశించి పోయాడు. అప్పుడు రామనామం అతని



చెవిలో మారుమ్రోగింది. భీముడు తెలివి తెచ్చుకొని ముందుకు సాగాడు. ఎన్ని విధాలుగా కవ్వించినా భీముణ్ణి మాయాజాలంలో ముంచలేక యక్షిణి విసిగి, చివరకు భయంకరాకారంతో అతణ్ణి అడ్డగించింది.

భీముడు హనుమంతుడి రోమాన్ని దాని ముందర వేయగానే సాక్షాత్కరించిన శివలింగానికి, కేశిక లెంపలు వేసుకొని సాగిలపడి మ్రొక్కి స్తోత్రపారాయణ మొదలు పెట్టింది. దాని ఆరాధన పూర్తయే లోగా భీముడు దళసరోవరంలో దిగి సౌగంధికా కమలాన్ని కాడతో త్రుంచి పట్టుకొని పలాయనమయ్యాడు. కేశిక ప్రచండ వేగంతో వెంబడించింది. దాని జుట్టు అగ్నిశిఖల్లాగ గాలిలో విరజిమ్ముకుంటూ భీముణ్ణి చుట్టుముట్టింది.

భీముడు దారి పొడవునా రోమాలు వేస్తూ భక్తురాలికి ఎడతెగని ఆరాధనా కాలక్షేపాన్ని కల్పిస్తూ తప్పించుకొని, హనుమంతుడున్న కదళీవనాన్ని చేరుకున్నాడు.

భీముడు సౌగంధికాపుష్పాన్ని హనుమంతుడికి చూపిస్తూ, "మహానుభావా! ఇప్పుడు నీ అనుగ్రహంతో నాకు విజయం చేకూర్చినట్లే, మున్ముందు కౌరవులతో మాకు జరగబోయే సంగ్రామంలో నీవు మాకు సహాయపడాలని మా పాండవులందరి పక్షానా వేడుకుంటున్నాను." అని చేతులు జోడించాడు.

అప్పుడు హనుమంతుడు, "భీముడా! నేను యీ కాలంలో యుద్ధం చేయను. అడిగావు గనక సంగ్రామం జరుగుతున్నప్పుడు నీ తమ్ముడు అర్జునుడి రథం మీది జండాను అంటిపెట్టుకుని రక్షగా ఉంటాను. మీకు జయం కలుగుతుంది! ఇక నీవు నిశ్చింతగా వెళ్ళి సౌగంధికను ద్రౌపదికి యిచ్చి ముచ్చట తీర్చు. మాయలేడిని కోరి ఆనాడు సీత అన్ని అగచాట్లు తెచ్చిపెట్టుకొన్నది. ఇలాంటి కోరికలు కోరడం అంతమంచిది కాదని చెప్పానని

చెప్పు. సౌగంధికా కమలాన్ని శివార్చన చేసి అలాగే ఉండనిచ్చి, తిరిగి కొప్పు ముడి వేసుకున్నప్పుడు శివనిర్మాల్యంగా తీసి ధరించమని చెప్పు! శివార్చన చేసి నందువల్ల మీకు శుభమూ, కుబేరుడి ఐశ్వర్యమూ కలుగుతాయి. సౌగంధిక ఎప్పటికీ వాడదు!'' అని చెప్పి భీముణ్ణి ఆశీర్వదించి పంపాడు.

భీముడు సౌగంధికాకమలాన్ని ద్రౌపది చేత శివార్చన చేయించాడు. హనుమంతుడు చెప్పమన్నది కూడా చెప్పాడు. ద్రౌపది విని సిగ్గుతో క్షణం ఊరుకొని, మందహాసం చేస్తూ, ''నేను సౌగంధికను కోరినందువల్లనే కదా ఆ మహానుభావుడి రక్ష మనకు లభించింది! నా కోరిక మూలాన మనకు మంచే జరిగినది కదా?'' అన్నది.

భీముడితో సహా పాండవులందరూ, ''ఔను! ఔను!'' అన్నారు. హనుమంతుడి అనుగ్రహానికి మహదానంద పడ్డారు.

పాండవులు నియమం ప్రకారం పన్నెండేళ్ళ వనవాసం ముగించి, తరువాత ఒక ఏడాది అజ్ఞాతవాసం విజయవంతంగా చేసి, కృష్ణుడిని తమ పక్షాన కౌరవుల దగ్గిరికి సంధి రాయబారానికి పంపారు.



కృష్ణుడు చెప్పిన హితవచనాలు దుర్యోధనుడు లెక్క చేయలేదు. సంధి పొసగలేదు. యుద్ధం తప్పనిసరి అయింది. రణదుందుభి మ్రోగింది. అర్జునుడి రథం మీద రెపరెపలాడుతున్న పతాకాన్ని హనుమంతుడు సూక్ష్మరూపంతో అంటిపెట్టుకొని ఎగిరాడు. కృష్ణుడు అర్జునుడి రథం తోలాడు. విజయధ్వజం ఉజ్వలంగా ఎగిరింది.

కురుక్షేత్రంలో మహాభారత సంగ్రామం బ్రహ్మాండంగా జరిగింది. కృష్ణుడు రథసారధిగా వుండి, గుర్రాలను అదలిస్తూ అర్జునుడి చేత దిగ్విజయంగా యుద్ధం చేయించాడు. అర్జునుడు విజ

యుడుగా పేరు పొందాడు. కృష్ణుడు విజయసారధి అనిపించుకున్నాడు.

దుశ్శాసనుడు ద్రౌపది జుట్టుపట్టి సభకు యీడ్చుకొని వచ్చినప్పుడు, అతడి రక్తంతో ద్రౌపది జుట్టు తడిపి ముడి వేస్తానని భీముడు ప్రతిజ్ఞచేసి ఉన్నాడు. అలాగే యుద్ధంలో భీముడు దుశ్శాసనుడి రొమ్ముచీల్చి ఆ రక్తాన్ని ద్రౌపది కొప్పుకు రాశాడు. అప్పుడు ద్రౌపది కొప్పు ముడి వేసుకొని సౌగంధికా పుష్పాన్ని తురుము కొన్నది. విజయధ్వజంగా ఉన్న హనుమంతుడికి, ఎంతో భక్తిశ్రద్ధలతో నమస్కారం చేసింది.

గదాయుద్ధంలో భీముడు దుర్యోధనుడి తొడలు విరగగొట్టాడు. భీముడు చేసిన ప్రతిజ్ఞలు నెరవేరాయి. కౌరవులు నిశ్శేషంగా హతులయ్యారు. పాండవులు విజయం పొందారు.

కృష్ణుడు హనుమంతుడిని అభినందించి, "హనుమంతుడా! నీ కార్యదీక్షతో ఆనాడు రాముడికి తోడుపడ్డావు. ఇప్పుడు కురుక్షేత్ర యుద్ధంలో విజయ ధ్వజంగా ఎగిరి ధర్మరాజుకు జయం చేకూర్చావు!" అన్నాడు.

అప్పుడు హనుమంతుడు వినయంగా, "మహారథుడైన అర్జునుడికి నువ్వు చక్రపాణివై సారధ్యం చేస్తూండగా జయం చేకూరక ఎక్కడికి పోతుంది? క్రియాసిద్ధికి మించిన బలమేముంది! నేను కేవలం ఒక చిహ్నాన్ని మాత్రమే!" అని అన్నాడు.

"ఔను! క్రియాసిద్ధికి నీవు చిహ్నంగా ఉంటావు! ఏ కాలంలోనైనా, ఏ రంగంలోనైనా నీ గురుతు గల జండా విజయం చేకూరుస్తుంది. విజయధ్వజంగా కలకాలం కీర్తి పొందుతుంది!" అని కృష్ణుడు భరతవాక్యం పలికాడు.

పాండవులందరి వందనాలు అందుకొని, కృష్ణుడి వద్ద శెలవు తీసుకొని హనుమంతుడు గంధమాదన పర్వతానికి ఎగిరివెళ్ళాడు. అక్కడ రామనామ స్మరణతో తపస్సులో నిమగ్నుడైయ్యాడు.






62

మొసలి కోతి వద్దకు వెళ్ళింది. అది ఆలస్యంగా రావటమేగాక, దిగాలుపడి ఉన్నట్టు కనబడటం చూసి కోతి, "మిత్రమా, నీ రాక ఆలస్యమయిందేం? నువు పుట్టెడు దిగులులో ఉన్నట్టు కనబడతావేం?" అని అడిగింది.

దానికి మొసలి, "మిత్రమా, నా భార్య చాలా కోపంగా ఇలా అన్నది: 'కృతఘ్నుడా, నీ ముఖం నాకు చూపటానికి సిగ్గులేదా? నువు రోజూ ఆ కోతి ఇచ్చిన పళ్లు స్వీకరించుతూ, ప్రత్యుపకారంగా ఏమీ చేశావు కావు. కనీసం అతన్ని మన ఇంటికి ఆహ్వానించావు కూడా కాదు. ఈ నీ కృతఘ్నతకు పరిహారం లేదు. కనక, నా మరిది అయిన కోతిని ఇవాళ మన ఇంటికి తీసుకురా, మనం చేయవలసినది చేద్దాం. అలా చేయకపోయావో నేను ఆత్మహత్య చేసుకుంటాను. మనం తిరిగి కలుసుకునేది ఆ లోకంలోనే!' అని నీ వదిన అయిన నా భార్య అన్నది. ఈ వాగ్వాదం మూలాన కొంచెం ఆలస్యమయింది. ఇప్పుడు నువు నా వెంట వచ్చెయ్యి. మీ వదినె ఇల్లంతా ముగ్గులు పెట్టి అలంకరించి, నీ కోసం తలవాకిట ఎదురు చూస్తూ ఉంటుంది," అన్నది.

"వదినెమాట సబబుగానే ఉన్నది. సాలెవాడు పోగులు లాగుకున్నట్టుగా బుద్ధిమంతుడు అస్తమానమూ ఒడుచుకోరాదు. ఇవ్వటమూ, పుచ్చుకోవటమూ, రహస్యాలు చెప్పటమూ, వినటమూ, తినటమూ, పెట్టటమూ అనే, ఆరూ ఆప్యాయత చూపే మార్గాలు. కాని నేనేమో వృక్షవాసిని, నువేమో జలవాసివి. నేను నీ ఇంట ఎలా ప్రవేశించ



గలను? అందుచేత నువు మా వదినెను ఇక్కడికి తెచ్చావంటే, నేను ఆమెకు పాదాభివందనం చేసి, ఆమె ఆశీస్సులు పొందుతాను,'' అన్నది కోతి.

దానికి మొసలి, ''మిత్రమా, ఈ నీటి అడుగున చక్కని ఇసుకదిబ్బ వద్ద మా ఇల్లు ఉన్నది. అందుచేత నా వీపు మీద ఎక్కి, నిర్భయంగా వచ్చెయ్యి,'' అన్నది.

కొత్త అనుభవంకోసం ఉవ్విళ్ళూరుతూ కోతి, ''అలా అయితే ఆలస్యం దేనికి? వెంటనే బయలుదేరు. ఇదుగో, నీ వీపు మీద ఎక్కాను,'' అంటూ మొసలి వీపు మీద కూర్చున్నది.

మొసలి ఒడ్డు నుంచి బయలుదేరింది. అది లోతు నీటిలోకి పోతూంటే కోతి భయపడి, ''మిత్రమా, అంత వేగంగా వెళ్ళకు. అలల తాకిడికి నా శరీరం తడిసి పోతున్నది,'' అన్నది.

''ఇక్కడ నీరు చాలాలోతు. కోతి ఎలాగూ తప్పించుకో లేదు. అది పూర్తిగా నా అధీనంలో ఉన్నది. అందుచేత దీన్ని నేను మా ఇంటికి ఎందుకు తీసుకు పోతున్నదీ చెప్పేస్తాను,'' అని తనలో అనుకుని మొసలి, ''మిత్రమా, నా భార్య కోరిక తీర్చి నిన్ను చంపటానికే నేను నిన్ను మాటలతో మోసపుచ్చి ఇక్కడికి తెచ్చాను. నీ చావు దగ్గిరపడింది గనక నీ ఇష్ట దైవాన్ని ప్రార్థించుకో,'' అన్నది కోతితో.

దానికి కోతి, ''మిత్రమా, నేను నీకు గాని, ఆమెకుగాని ఏమి ద్రోహం చేశానని నన్ను చంపాలనుకున్నారు?'' అని అడిగింది.

''నువు అమృతంలాటి నేరేడుపళ్ళు తినటంచేత నీ గుండెలో అమృతంచేరిం దిట. నీ గుండెను తింటే తనకు ముసలి తనమూ, చావూ రావని అనుకుని, నిన్ను తీసుకు వస్తానన్నదాకా నన్ను వేధించింది. అందుకే నేను నిన్ను తీసుకుపోతున్నాను,'' అన్నది మొసలి.

కోతికి గొప్ప ఆలోచన వచ్చింది. అది మొసలితో, "మిత్రమా, ఈ సంగతి ఒడ్డున ఉండగానే ఎందుకు చెప్పావు కావు? నేను ఎప్పుడూ నా గుండెను నేరేడు చెట్టు మధ్యలో రహస్యంగా దాచి ఉంచుతాను. రోజూ అన్నిసార్లు నేను చెట్టు ఎక్కుతూ, దిగుతూ ఉండటం దేని కనుకున్నావు? అది భద్రంగా ఉన్నదీ, లేనిదీ చూడటానికే. వదినె దాన్ని కోరితే అంతకన్నానా? కాని అసలుదైన గుండె లేకుండా నన్ను నువు ఆమెదగ్గిరికి తీసుకుపోయి ఏం లాభం?" అన్నది.

బుద్ధిమాలిన మొసలి ఆనందంతో, "అలా అయితే నేను నిన్ను చెట్టు వద్దకు తిరిగి తీసుకుపోతాను. నువు నాకు నీ గుండె ఇచ్చెయ్యి. అది లేకుండా నా భార్య పారణ చెయ్యదు," అని, వెనక్కు తిరిగి వచ్చి, కోతిని నేరేడు చెట్టు మొదట్లో చేర్చింది.

దారిలో, తన క్షేమంకోసం అనేకమంది దేవుళ్ళకు ఎన్నో మొక్కులు మొక్కిన కోతి, చెట్టును ఎన్నడూ ఎక్కనంత వేగంగా ఎక్కి, చాలా ఎత్తయిన కొమ్మను చేరి, పెద్ద నిట్టూర్పువిడిచి, "అమ్మయ్య, నా ప్రాణం దక్కింది. అనర్థులను ఎన్నడూ నమ్మరాదనీ, నమ్మదగిన వారిని కూడా మితిమించి నమ్మరాదనీ, అలాటి నమ్మకం ఆపదకు మూలమనీ ఊరికే అన్నారా? నేను మరోజన్మ ఎత్తినంత పని చేశాను," అనుకున్నది.

కోతి ఇలా అనుకుంటూ ఉంటే మొసలి, "మిత్రమా, నీ గుండె ఇచ్చేస్తే, నేను దాన్ని మీ వదినెకిచ్చి, ఆమె ఉపవాసం మాన్పిస్తాను," అన్నది.

కోతి వెటకారంగా నవ్వి, "పోరా, వెధవా! కృతఘ్నుడా! ఎవరికైనా రెండు గుండెకాయలుంటాయా? ఇక్కడ నుంచి తక్షణం వెళ్ళిపో. ఈ నేరేడుచెట్టు నీడన మళ్ళీ అడుగుపెట్టకు. ఒకసారి మిత్రద్రోహం చేసినవాడు మరొకసారి అలాటి పనికి ప్రయత్నించాడంటే తప్పక నశిస్తాడు," అన్నది.



# 200. 7 వేల ఏళ్లనాటి గ్రామం

చీనా ఆగ్నేయ తీరాన, చికియాంగ్ రాష్ట్రంలో జరిగిన తవ్వకాలలో, 7 వేల ఏళ్ళనాటి నూతన శిలా యుగసంస్కృతికి చెందిన గ్రామం బయటపడింది. అక్కడ కొయ్య ఇళ్లూ, వడ్లకుప్పలూ, ఊకకుప్పలూ కనిపించాయి. అక్కడి ప్రజలు అధికంగా ఎముకలతో చేసిన పరికరాలు వాడారు. అలాటి పరికరాలు 1,800 దొరికాయి. కుండ పెంకులు 2 లక్షలు దొరికాయి. వర్ణనలలోతప్ప ప్రత్యక్షంగా కనిపించని నెల్లలు ఈ తవ్వకాలలో దొరికాయి.

ఇక్కడ కనీసం 48 రకాల జంతువుల ఎముకలు కనిపించాయి. వాటిలో హెచ్చుగా ఉన్నవి జింకలూ, తాబేళ్ళూనూ. మిగిలిన జంతువులలో పక్షులూ, చేపలూ, ఎలుగుబంట్లూ, కోతులూ, పులులూ, ఖడ్గమృగాలూ, ఏనుగులూ కూడా ఉన్నాయి. అప్పటి ప్రజలు గుహలలో జీవించటం మానేసి, ఆహారం ఏరుకోవటంతో బాటు, వ్యవసాయమూ, గృహనిర్మాణమూ 7 వేల ఏళ్ళక్రితమే అవలంబించి ఉండటం గమనించదగిన విషయం.











# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

## ?

ఒక వైష్ణవాచార్యుడు దూరప్రయాణం చేస్తూ చీకటిపడి ఒక గ్రామం చేరాడు. ఆ గ్రామంలో అందరూ వైష్ణవులేనని దారిలో ఒక మనిషి చెప్పాడు. అందుచేత వైష్ణవాచార్యుడు ఆ గ్రామం చేరుకుని, ఒక ఇంటి ముందు నిలబడి, "అయ్యా, నేను వైష్ణవుణ్ణి. మీరు కూడా శ్రీ వైష్ణవులే అయితే, ఈ రాత్రికి మీ ఇంట తలదాచుకోనియ్యండి," అన్నాడు.

"క్షమించండి! నేను వైష్ణవుణ్ణి కాను. నా వంటి నీచుడి ఇంట ఆశ్రయం పొంది, మీరు మైలపడరాదు," అన్నాడు ఇంటి యజమాని.

వైష్ణవాచార్యుడు మరొక ఇంటికి వెళ్ళి, అలాగే అడిగి, ఆ ఇంటివాళ్లు కూడా వైష్ణవులు కారని తెలుసుకున్నాడు. చిత్రంగా, ఎన్ని ఇళ్ళు తిరిగినా ఒక్క ఇల్లూ వైష్ణవులది కాదని తెలియవచ్చింది!

వైష్ణవాచార్యుడు దారే పొయ్యేవాణ్ణి ఆపి, "ఈ గ్రామంలో అందరూ వైష్ణవులే అని విన్నాను. కాని ప్రతి ఒకరూ తాము వైష్ణవులం కామంటున్నారు!" అన్నాడు.

"అయ్యా, ఇక్కడ అందరూ వైష్ణవులే. కాని, విష్ణుభక్తులకు అహంకారం పనికిరాదు. నేను వైష్ణవుణ్ణి అంటే ఎవరూ ఆతిథ్యమియ్యరు. మరొకలా అడిగి చూడండి," అన్నాడు దారేపోయేవాడు.

వైష్ణవాచార్యుడు ఒక ఇంటికిపోయి, "అయ్యా, నేను పరమ నీచుణ్ణి. నాకు ఆశ్రయం లభిస్తుందా?" అని అడిగాడు.

"లోపలికి దయచెయ్యండి!" అన్నాడు గృహస్థు. —సింగంపల్లి అప్పారావు.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2&3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలింపబడవు.

కార్డులు మాకు ఆగస్టు 20 లోగా చేరాలి. అందులో ఫోటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, అక్టోబరు నెల చందమామలో ప్రకటించబడును.

---

జూన్ నెల పోటీ ఫలితం: తలవాసి, నోరు తెలుపును.

గెలుపొందిన వారి పేరు: ఎస్. రాజారావు. గుత్తావిల్లి. (శ్రీకాకుళం జిల్లా)

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1978 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



Azmat A. Syed





Azmat A. Syed

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ ఆగస్టు నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఒంటరి బతుకు

రెండవ ఫోటో : వంటింటి బతుకు

పంపినవారు : టి. కృష్ణమోహన్, మిషనరీ గరాజ్, మోతీగూడెం.

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.

బామ్మగారి పేజీ
వ్యాసాలు
తీరిక వేళల్లో....
గొప్పవారితో గోష్ఠులు
మాటల కొలువు
వార్తలు....
కుటీర పరిశ్రమలు
కథలు....సశేష నవలలు
అవి – ఇవి
సమస్యలూ సలహాలూ
మన దేవాలయాలు
పెరటితోట పెంపకం
పిల్లల పుట్టిన రోజులు
వైద్య సలహాలు
గృహాలంకరణ
పొరుగు రాష్ట్రాల వంటలు
ప్రపంచ వార్తలు
మొదలైనవన్నీ గల స్త్రీజన
మాసపత్రిక ఏది? చెప్పు చూదాం!



కత్తిరించి ఉంచండి.

# బోర్న్‌విటా

# ఆశ్చర్యకరమైన పరిశోధన పుట-2

## ఎలక్ట్రిక్ బల్బ్ యొక్క అద్భుతం

కనిపెట్టినవారు : థామస్ ఆల్వా ఎడిసన్ 1847-1931 యు.ఎస్.ఎ.

సూత్రము : విద్యుచ్ఛక్తి వెలుగుగా మరియు ఉష్ణ శక్తిగా మార్చబడుట.

సంవత్సరం : 1879

## ఎలెక్ట్రిక్ బల్బ్ ఎలా పనిచేస్తుంది?



ఎలెక్ట్రిక్ బల్బ్ ప్రధానంగా రెండు లోహపు కడ్డీలను కలిగియున్నది. ఇవి చాలా సున్నితమైన చాలా ఎక్కువగా చుట్టబడిన టంగ్‌స్టన్ తీగతో కలుపబడ్డాయి. ఈ కడ్డీలు నైట్రోజన్ మరియు ఆర్గన్ గ్యాసుల మిశ్రమంతో నింపబడిన గాజు బల్బులో అమర్చబడ్డాయి. మీరు లైట్ స్విచ్ ఆన్ చేయగానే విద్యుచ్ఛక్తి సున్నితమైన టంగ్‌స్టన్ తీగ చుట్టల ద్వారా ప్రసరిస్తుంది. టంగ్‌స్టన్ తీగ చుట్ట చాలా పలుచనిదగుటవల్ల కరెంటు ప్రసారాన్ని బాగా నిరోధించి తద్వారా ఒక రకమైన ఎలెక్ట్రిక్ రాపిడిని కలిగిస్తుంది. ఈ రాపిడికి తీగ చుట్ట నుంచి నెగెటివ్‌గా ఛార్జి అయిన కణాలను (ఎలెక్ట్రాన్స్)ను తట్టుతుంది. తీగ చుట్ట పోజిటివ్‌గా చార్జి అయి తిరిగి ఎలెక్ట్రానిక్ బాక్‌కి తగులుకుంటాయి. ఇవి వేడి మరియు వెలుగుని ప్రసరింపచేస్తాయి. టంగ్‌స్టన్ అతి ఎక్కువ శీతోష్ణ స్థితులలోనే కరుగుతుంది (3380°C) కాయిల్ కరగదు. ఇది గాజు బల్బులో ఆక్సిజన్ లేకపోతే కాలిపోదు గూడా.





కత్తిరించి ఉంచండి.